# 'అడుగుజాడలు'

## నాటకంపై అభిప్రాయాలు

ఈ నాటకం చాలాకమనీయంగాఉంది. పఠింపదగి, ప్రదర్శింపదగి పల్లెటూరి జీవితానికి సంబంధించినంతవరకూ ఉన్న మూఢ విశ్వాసాలను పోగొట్టేదేకాక విజ్ఞానాన్ని రాబట్టేదీ, జనులలో ఐకమత్యాన్ని కూడగట్టేదీ అయివుంది. ఇంకా ప్రణాళికలపై ఖర్చు పెట్టడం, సంఘాలను వెయ్యడంవంటి పనులను కట్టిపెట్టి దూరాలోచనతో ప్రభుత్వం ఈలాటి నాటకాలను వ్రాయించి, ప్రచారంచేయిస్తే ప్రణాళికల పరిశ్రమలు పల్లెటూళ్ళల్లో బాగా ఫలిస్తాయి.

—*ఆంధ్రపత్రిక*

ఈ చక్కని నాటకంలో తెలంగాణా మాండలిక భాషను మాట్లాడేకొమరన్న, పాపన్నపాత్రలు; పాతకొత్తల మేలు కలయికను ప్రబోధించే అనుభవజ్ఞుడు నరసయ్యన్న పాత్ర మనస్సుకు హత్తుకుంటాయి. —*గోలకొండ పత్రిక*

ప్రతిపనికీ ప్రభుత్వసహాయంకోసం ఎదురుచూడరాదని, గ్రామాలలో ప్రజలే స్వయంగా అన్ని పనులు నిర్వహించుకోవాలని ప్రబోధించడం ఈ నాటకం లక్ష్యం....ఈ ప్రబోధానికి కాళ్ళూ, చేతులూ కల్పించి, చదవడానికి ఇంపుగా తయారుచేశారు. —*విశాలాంధ్ర*

The author, however, deserves to be congratulated for Producing timely play.

—*'Romero' in Daily News*

ఈ పుస్తకం నాటకరూపంలో వున్నా, విడిగా చదువుకుని ఆనందించగలం. ఇటువంటి పుస్తకాలెన్నివచ్చినా మనకు లోటు తీరదు.

అతి సహజంగా పాత్రధారులంతా తమ పాత్రలను నిర్వహించి వాస్తవికజగత్తునూ మనంసృజించదలచిన జగత్తునూ నిరూపించినారు.

—*చండీ జగన్నాథం*

జీర్ణించి గడ్డకట్టుకుపోయిన స్వార్థులగు గ్రామ పెద్దల జీవిత రహస్యాలను చక్కగా తెలిపారు. —*టి. సత్యనారాయణశర్మ*

## అంకితం :



విశ్రాంతి తీసుకోవలసిన వయస్సులో విరామం లేకుండా కృషిచేస్తాడు నాన్న. స్వంత వూళ్లోనైతే పొలంపనీ, హైదరాబాదులోనైతే ఇంటి నిర్మాణం పనీ చూసుకొని అలిసిపోయి ఇల్లుచేర్తాడు. ఆస్థితిలో నాన్నకు నా మొహాన్ని చూపడానికి అమిత సిగ్గు వేస్తుంది. అయినా — నాన్న కించిత్తయినా చిరాకుపడక మహా ఓర్పును చూపుతాడు. అంతటి అమృతమూర్తి నాన్నకు- అవసర బాధ్యతలను నిర్వర్తించని నా అసమర్థతకు మారుగా

ఈ భక్త్యాంజలి.

# పరిచయం

నేను హైదరాబాదులో అడుగుపెట్టగానే మొట్టమొదట చేసిన పని ఈ నాటక ప్రదర్శనోత్సవాన్ని ప్రారంభించడం. నేను చేసిన ఈ పని నాకు అనేకమంది స్నేహితులనూ, సహచరులనూ ప్రసాదించి, ఇంతవరకు నే నిక్కడ గడిపిన జీవితానికొక వన్నెను చేకూర్చింది. అందుకు, ముందు ఈ నాటకకర్తనూ, ఈ నాటకాన్ని ప్రదర్శించిన సమాజంవారినీ అభినందించవలసివుంది.

ఈ నాటకకర్త నాకు చాలా ఆప్తుడు. ఈయన పుస్తకాలను కొన్నింటిని ఇంతకుముందే నేను చదివాను. ఈయన ఒక నిర్దుష్టమైన ఆశయాన్ని సాధించడానికి/తాను రచనలనుచేసే వ్యక్తిత్వం గలవాడు. అయితే, ఒక ఆదర్శాన్ని పెట్టుకొని రచనలు చేయడంలో అపాయం లేకపోలేదు. ఈ అపాయం ఇటీవలవచ్చే రచనలలో ప్రస్ఫుటంగా కని పిస్తూఉంది. అదేమిటంటే—రచనలు స్వభావసిద్ధంగా ఉండాలనే అపేక్ష కొద్దీ కల్పనాపటిమకు చోటులేకుండా చేయడం. ఈ నాటకంలో ఇటు వంటి దోషంకూడా లేదు. కల్పనాశక్తీ, స్వాభావికతా రెండూ సరైన పాళ్లలో కలపబడి ఇటు రసహృదయుల్నీ, అటు సామాన్య ప్రేక్ష కుల్నీకూడా ఆకర్షించే శక్తి ఈ నాటకంలో వుంది.

స్వభావసిద్ధత అనే నెపంతో ప్రకృతిలో జరిగే సంఘటనలు యథాతథంగా చిత్రించడం ఉత్తమ కళ లక్షణం కాదు. అది వొట్టి ఫొటోగ్రఫీ మాత్రమే అవుతుంది. ప్రకృతిలో జరిగే సంఘటనలను తన మనోబలంతో రంగరించి, వాటికి రసపుష్టి కలిగించినపుడే అది ఉత్తమ కళ అవుతుంది. ఈ నాటకానికివచ్చిన ప్రేక్షకుల్ని చూచి నప్పుడూ, ఆ ప్రేక్షకుల హృదయాలలో ఈ నాటక ప్రదర్శనం కలి గించిన సంచలనం గమనించినప్పుడూ—ఈ నాటక కర్త ఈ రెండు లక్ష

ణాలను అతి చాకచక్యంగా సమన్వయంచేసి కృతకృత్యుడయ్యాడని పించింది నాకు.

ఇది సంఘటనలమీద ఆధారపడిన నాటకం కాదు. మనస్తత్వ పరిశీలనకు ఇందులో ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వబడింది. అందువల్ల సంఘటనలు తక్కువగానూ, సంభాషణలూ, చర్చలూ ఎక్కువగానూ ఇందులో కన్పిస్తాయి. చేపట్టిన కథావస్తువునిబట్టీ, అనుసరించిన విధానాన్నిబట్టీ ఇది తప్పనిసరి. సాంప్రదాయసిద్ధంగా నాటకాలు వ్రాసిన పూర్వ నాటక కర్తలకూ, బెర్నార్డ్ షాలాంటి ఇటీవల ప్రసిద్ధికెక్కిన నాటక కర్తలకూ ఇదే భేదం. ఈ భేదం గమనించనివారికి ఇటువంటి నాటకాలలో సంఘటనలకంటే సంభాషణలు ఎక్కువగా ఉండి, ఇదేదో విడ్డూరంగా కన్పించవచ్చు. కాని, వాస్తవానికి ఇటువంటి నాటక రచనలే ఇప్పు డవసరం. ఈనాడు వ్యక్తులజీవితాలలో భౌతిక సంఘర్షణలకంటే మానసిక సంఘర్షణలు ప్రాధాన్యత వహించడమే దీనికి కారణం.

ఇందులో సరళ పాత్ర ముఖ్యమైంది. ఆ పాత్ర చుట్టూ ఉపగ్రహాలుగా తిరుగుతుంటాయి మిగిలిన పాత్రలు. ఆ పాత్ర మనస్తత్వ విశదీకరణకు మిగిలిన పాత్రలు ఉపకరిస్తాయి. ఈ విధంగా మానసిక సంఘర్షణనూ, దానివల్లవచ్చే పరివర్తననూ చిత్రించడానికిగాను నాటకాన్ని వ్రాయడం చాలా కష్టమైన పని. ఈ పనిని ఈ నాటకకర్త తన సహజ చాతుర్యంతో నిర్వర్తించి ధన్యుడైనాడు.

ఈ నాటకం చూస్తున్నంతసేపూ నాకు బెర్నార్డ్ షా నాటకాలు కళ్లముందు ఆడుతున్నయి. పాత్రలన్నీ స్వభావ సిద్ధమైనవిగానే కనుపిస్తయి. వాటి అనుభూతులన్నీ మనం మామూలు వ్యక్తుల్లో నిత్యం చూస్తున్నవిగానే కనిపిస్తయి. కాని ఏ పాత్ర వ్యక్తిత్వం ఆ పాత్రకి

ఉంటుంది. ప్రతి పాత్ర వెనుకా ఒక సిద్ధాంతం ఉన్నట్లు కనుపిస్తుంది. ప్రతి పాత్రా తన సిద్ధాంతాన్నిగురించి తాను మాట్లాడగలదు. అందరి మానసిక సంఘర్షణలకూ అతీతంగా వుండి సమన్వయపరచ గలిగిన డాక్టర్‌కీ ఒక సిద్ధాంతంవుంది. చివరికి 'శీను'కి కూడా ఒక సిద్ధాంతం ఉంది. ఉండటమేకాదు. అతను అదను దొరికినప్పుడల్లా దానిని స్ఫురింపజేయ గలడు. ప్రతిపాత్రకు ఈ విధంగా బలాన్నీ, గంభీరతనూ కలిగిస్తూ మళ్ళీఆయాపాత్రల స్వాభావికతకు ఏమాత్రం చెరుపూజరగకుండా పాత్రపోషణ చెయ్యగలిగాడీ నాటకకర్త. ఇది గొప్ప శక్తి. ఈ శక్తి ఈ నాటకకర్తకు సహజంగావుంది. ఏ బెర్నార్డ్‌షా చదవటంవల్లో వచ్చిందికాదు. అందువల్ల నా మనస్సు రంజిల్లింది. ఈ నాటకం చూడటం ఫలితంగా నా మనోవీధిలో ఆకాశం ఎత్తున పెరిగాడు ఈ నాటకకర్త.

మామూలుగా మన రచయితలు ఏ కారణంవల్లోగాని క్రమ క్రమేణా వృద్ధిచెందుతూ కళాసేవ చేయడం జరగడంలేదు. అతి ప్రతిభావంతంగా తమ కళా జీవితాన్ని ప్రారంభించి, ఉన్నట్టుండి అకస్మాత్తుగా దిగజారిపోవడం జరుగుతూవుంది. ఈ నాటకకర్త ఈ విషమ స్థితికికూడా అతీతుడైనాడు. ఈయన నాటకాలు చదివినప్పుడు ఈ విషయం సుబోధకమవుతుంది. క్రమ క్రమేణా వృద్ధిచెందుతూ, క్రమ క్రమేణా తన ఆదర్శాన్ని విశాలం చేసుకుంటూ తన జీవితానికొక నిత్య నూతనమైన శోభను దిద్దుకుంటూ పురోగమిస్తున్నట్టు కనిపిస్తుంది.

ఈయన మొదటి నాటకాలలో కళాదృష్టికంటే ప్రచారదృష్టి ఎక్కువగాఉంది. ప్రచార దృష్టి వుండడం తప్పనికాదు. నాటక కర్త తానొక సందేశాన్ని సంఘానికి ఇవ్వవలసి వుందనుకున్నప్పుడు దాన్ని ప్రచారం చేయాలనుకోవడంలోగానీ, అందుకు ప్రయ

త్నించడంలోగానీ అస్వాభావికతేమీ లేదు. బెర్నార్డ్‌షా చెప్పినట్లు ప్రతి రచనకూ ప్రయోజనం అనేది ఒకటి వుండితీరుతుంది. అయితే కొందరు తమ రచనలు ప్రయోజనాతీతములైనట్లు నటించటం మాత్రం జరుగుతూవుంటుంది. ప్రయోజనం అంటే ఏమిటి అనే ప్రశ్నకు జవాబు చెప్పుకోవటంలో భేదాభిప్రాయాలు వుండవచ్చు. అది వేరు సంగతి.

అయితే, ప్రచార దృష్టిని కళా దృష్టితో మేళవించి అదుపులోకి తెచ్చుకోక నగ్నరూపంలో నిలబెట్టినప్పుడు అది ప్రేక్షకులను కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది; బెదిరిస్తుంది; భయపెడుతుంది. దానివల్ల ప్రేక్షకుల హృదయాలలో రస సృష్టి జరగదు. ప్రేక్షకుల ఆవేశాలు స్వచ్ఛపడవు. ప్రేక్షకులకూ, నాటకకర్తకూ మధ్య నగ్నంగా నిలబడిన ఈప్రచార దృష్టి ఒక పెద్ద గోడగా వ్యవహరించి రసభంగానికి మాత్రమే తోడ్పడుతుంది. ఈ నాటకంలో ఈ ఆవేశాన్నికూడా జయించా డీనాటకకర్త. అందువల్ల ఈ నాటక ప్రదర్శనం ఇంచుమించు ప్రేక్షకులందరి మనస్సులనూ ఉత్తేజపరచ గలిగింది. తన ఆదర్శాన్ని నెరవేర్చుకోగలిగింది.

ప్రచారదృష్టినీ, కళాదృష్టినీ సరిగా సమన్వయం చేయని రచనలు ఎక్కువగా వచ్చే రోజులివి. ఇటువంటి రోజుల్లో ఈ సమన్వయాన్ని ప్రతిభావంతంగా చేసి ఈ నాటకం రచించగలిగినందుకు ఈయనను నేను అభినందిస్తున్నాను.

ఒక దృష్టికి ఈనాటకం ఇతివృత్తం స్త్రీలు నాటకరంగం ప్రవేశించ వచ్చా లేదా అనేదిగా కనుపించవచ్చు. దీనికి కారణం ఈ నాటకం, నాటకం వెయ్యాలనే సంకల్పంతో ప్రారంభంకావటం, ఈ విషయాన్ని గురించి పాత్రలు చర్చించటం, చివరికి నాటకం

వెయ్యాలనే నిర్ధారణతో ఈ నాటకం పూర్తి అవటం కావచ్చు. కాని నా బుద్ధికి మాత్రం ఈ నాటకం ఇతివృత్తం వేరుగా స్ఫురిస్తూవుంది. అది కోర్కెలను అణచుకొని, వాటి వికృత రూపాలే తన భావాలను కొని తాను క్షోభపడుతూ, తన చుట్టూవున్న ఇతరుల జీవితాలను కలవరపెట్టే ఒక నవీన విద్యావతి జీవితగాధ అని, అనిపిస్తూవుంది. ఆమే ఇందులో కధానాయకి అయిన సరళ. ఆమెకు అనేక కోర్కెలు వుంటై. వాటితోపాటు ఆ కోర్కెలను తీర్చుకోటానికి అనేక అడ్డంకులుంటై అడ్డంకులే ఆమెజీవితానికి పునాదులౌతై. ఈఅడ్డంకులు స్వచ్ఛమైన సరళమైన ఒక నదీ ప్రవాహాన్ని పర్వత శ్రేణులు అడ్డుకున్నట్టు అడ్డుకుంటై. దానితో నదీప్రవాహం పెడతిరుగుతుంది! చిందులు తొక్కుతుంది: మలిన పడుతుంది. భీభత్సపడి వికృత రూపాన్ని ధరిస్తుంది.

ఇటువంటి పాత్రను తీసుకొని, ఆపాత్ర స్వభావాన్నీ దాని వక్ర గతికికారణాన్నీ ప్రేక్షకులకు విశదపరచి, దాని నివారణోపాయాన్ని సూచించి, నేడుప్రతిమానవుని హృదయాన్నీ వేధించి సంకుచిత పరచుతున్న అనేక కాంప్లెక్సులనూ, ఇన్హిబిషన్లనూ తొలగించుకొని ఎవ్వరికి వారు తమ స్వభావాలను తెలుసుకొని ప్రవర్తించాలని ప్రబోధించటం ఈ నాటకం ఉద్దేశం అని నేను అభిప్రాయ పడుతున్నాను. ఇందుకు, నాటక రంగంలో స్త్రీలు పాల్గొనవచ్చునా లేదా అనే సమస్యను తీసుకోవటం ఒక సాధనంగా ఉపయోగించుకోటానికి మాత్రమే అని పిస్తూవుంది నాకు. అలాగే ఉపయోగింపబడిందనికూడా నా విశ్వాసం.

ఒక పాత్ర పరిశీలన చాలా కష్టం. యంత్రాన్ని పరిశీలించినట్లు మనుష్యులను పరిశీలించలేం. ఎంత జాగ్రత్తగా పరిశీలించినా ఏదో మిగిలే ఉంటుంది. అందనిది ఎక్కడో వుండనే వుంటుంది. అనిచెప్పి

మానవ పరిశీలనకు పూనుకోకుండా వూరుకోలేం. ఇప్పటికి అందరం అర్ధసత్యాలతో గజిబిజి పడుతున్నవాళ్లమే. కాని ఆ అర్ధసత్యాలను నమ్మి, అవి సూచించిన దారిన అడుగు వేసుకుంటూ పోవటమే సత్య సాధనకు మార్గమని మనం విస్మరించరాదు. ఇవి అర్ధసత్యాలని వాటి దారిన వాటిని పోనిస్తే ఎప్పటికీ వెలుగనేది కనుపించనే కనుపించదు. ఈ పరిస్థితులను అన్నిటినీ మనస్సులో పెట్టుకొని చూచినప్పుడు, "ఈ నాటకకర్త ఎంత భారపుపనికి పూనుకున్నాడు! తన కర్తవ్యాన్ని ఎంత ముచ్చటగా నిర్వర్తించుకున్నాడు!!"అని అనిపిస్తుంది నాకు. ఈవిషయం ఆలోచించినప్పుడల్లా నేను ముగ్ధుణ్ణి అవుతూవుంటాను.

ఈ నాటకకర్తకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉన్నది. తెలుగు సాహిత్యరంగంలో ఈయన ఇప్పటికే ఒక నిర్దుష్టమైన ప్రత్యేకస్థానాన్ని సంపాదించుకున్నాడు. ఇకముందు తన ప్రతిభను ప్రజాసామాన్యానికి సమగ్రమైనదృష్టిని కలిగించి, దేశంయొక్క సర్వతోముఖాభివృద్ధికి ఈయన వినియోగించగలడని నా నమ్మకం.

గోపీచంద్

సూతాశ్రమం,
1-4-1957

# ఆశీస్సు

'రావు' వ్రాసిన 'క్రీనీడలు' నాటకాన్ని చదువకముందు స్టేజీ మీద చూడటం తటస్థించింది. ప్రేక్షకులలో ఏదో ఆలోచిస్తూ కూర్చుని ఉన్న నాకు, "చెడిపోయే వాళ్లకి ఒక్క నాటక రంగమే కావల్సి వచ్చిందా...అలాంటివి లక్షలున్నాయి. ఆ మాటకొస్తే అసలు ఆడ మగ కలిసి పుట్టిన ఈ లోకమే చెడిపోవడమని అనుమానించడానికి మొదటి మెట్టంటాను"అని డాక్టరు స్టేజీమీద అంటుంటే అక్షరాలా 'రావు' కనిపించాడు. "చెడిపోవడ మనేది ఆడవాళ్ల మొహాన్నే వ్రాసి ఉందా బ్రదర్. మొగాడి మొహాన లేదంటావ్"..., "అనారోగ్య వాతావరణాన్ని చీల్చాలి, సాహసం గల స్త్రీలు రంగంలోకి దిగి తప్పుదారిని వెళ్ళే సమాజాల ధోరణిని మార్చాలి"..., "అంతరంగంలో కుళ్ళేకంటే బహిరంగంగా సంతోషించడ మనేది నా తత్వం" అంటాడు 'క్రీనీడల'లోని 'డాక్టరు'. 'డాక్టరు' అంటాడు అనేకంటే 'డాక్టరు' ద్వారా 'రావు' సంఘ సంస్కర్తగా తన అభిప్రాయాలను వెల్లడించాడు. అయితే ఒక్క 'డాక్టరు' పాత్ర ద్వారానే 'రావు' తన భావాలను వ్యక్తపఱచాడు; మిగతా పాత్రలలో తన స్వంత భావాలను వెల్లడించలేదు అని కాదు. అప్పుడప్పుడు వాళ్లల్లోనూ 'రావు' కనిపిస్తాడు. "పిలిపించి నాయనకు లేని తప్పు నాకేనా" అంటున్న 'రాధ'లోను; "ఎవరి కీర్తిని వారు కష్టపడి సంపాదించుకోవాలే గాని ఇతరుల కీర్తిని కొల్లగొట్టడంవల్ల తమకు కీర్తి రాదు"అంటున్న 'వాసు' లోను; "నాటకాలకు ఆడవాళ్ళు లేరని బాధపడుతూ ఉండేవాడు... అందుచేత మా అమ్మాయిని పంపాను"అంటున్న 'సీతాపతి'లోను కనిపిస్తాడు 'రావు' సంఘ సంస్కర్తగా. సంఘ సంస్కర్తగా అని ఎందు

కంటున్నానంటే సాంఘిక సమస్యల్ని ఎత్తి వాటిని పరిష్కరించ డానికి ప్రయత్నించాడు.

"అవును శీనూ, నేను అర్థం కాను. అప్పుడప్పుడు నేనే అను కుంటూ ఉంటాను ఏంచేస్తుంటానా అని"..., "అప్పుడప్పుడు అయో మయంగా మాట్లాడ్తాకదూ, అర్థంకాదు. ఒకొక్కప్పుడు నాకే అర్థంకాదు"...,"ఘోరం చేశాను. నాకు తెలియకుండా చేశాను. ఒకొక్కప్పుడు తెలిసికూడా పట్టలేక అపకారం చేశాను" అంటున్న 'సరళ'లో 'రావు' మనస్తత్వ పరిశీలకునిగా గోచరిస్తాడు. ఒక్క 'సరళ' లోనే కాదు,"మనం కూడ అంతటి వారం కాలేకపోయామే అనే చెప్పరాని దిగులుతో ఆ పనిచేస్తూ ఉంటారు. పైకి మాత్రం పట్ట లేక ఛీ! ఛీ! వాళ్లంతా అపవిత్రులు అని వెఱ్ఱి ప్రచారంచేస్తూ ఉంటారు" అనే 'డాక్టరు' లోను; "తనకన్న తెలివి తక్కువ వాళ్లని భావించినప్పుడు వాళ్లను తెగ ఏడిపించడానికి ప్రయత్నించేది; తెలివి కల వాళ్లను చూస్తే ఈర్ష్య పడేది" అనే 'వాసు' లోనూ 'రావు' అలానే కనిపిస్తాడు.

"నేను ఎంతో మంది పొట్టలు చీల్చి రోగాలు కనుక్కో గలి గాను గాని నీ మనసులో ఏముందో తెలుసుకోలేక పోయాను" అంటున్న 'డాక్టరు' లోను; "ఆ మధ్య నొకసారి నేను ఆడవేషం వేస్తే మేకప్పులో కొట్టొచ్చేటట్టుంటాననిఅన్నావు కదూ"...,"హాస్యానిఅంటి పెట్టుకుని ఉండబట్టే కదండీ (దర్జాగ) నా పరీక్ష పోయింది"..., "ఇందులో ఎవరి మనసూ బాగాలేదు. ఒక్క నాది తప్ప. (మళ్ళా సందేహ మొచ్చింది) అక్కయ్యా! అసలు నాకు మనసుందానేని?" అంటున్న 'శీను'లోను తాను నవ్వకుండా ఇతరులను నవ్వించే 'రావు' గుర్తుకొస్తాడు. ఆ హాస్యంకూడా అర్థయుతంగా, అందంగా, ఆహ్లాద కరంగా, ధారాళంగా, సునాయాసంగా ఉంటుంది.

వీటన్నింటిని 'రావు' భావాలనే అంటాను. 'క్రీనీడలు' కథ ఇతి వృత్తం అనను. ఎందుకంటే దానిలో ఏ ఒక్క పాత్రను పూర్తిగా పోషించడానికి ప్రయత్నించలేదు 'రావు'. కేవలం ఒకరోజు ఉదయం మొదలుకొని ఆ రోజు సాయంత్రంవఱకే, అంటే ఒక్క అర్ధరోజులో అయిదారు పాత్రలలో కలిగిన సంచలనాలు, ఉద్రేకాలు, ఆత్మవిమర్శనలు మాత్రమే 'క్రీనీడలు' ఇతివృత్తం. ఈ సంఘటనలనుబట్టి మనం 'క్రీనీడలు'లోని పాత్రల స్వభావాలను నిర్ణయించుకుంటాం తర్వాత.

'క్రీనీడలు' నాటకం అని రచయిత అంటున్నాడు కనుక 'ఎంత వఱకు దానిలో నాటకీయత ఉంది? ఎంతవఱకు పనికివస్తుంది స్టేజి మీద వేయడానికి?' అని పూర్వులు స్థిరీకరించిన నాటక లక్షణాలతో కొలిచి, తూచి 'ఇది అసలు నాటకమే కాదు' అనవచ్చు. "నీవు అందెలు, వడ్డాణము, కాసులపేరు, ముక్కుబులాకు పెట్టుకోలేదు. అందుచేత నీవు స్త్రీవికావు" అంటే ఆ కొలతబద్దలతో నన్ను కొలిచి, ఆ తులామానాలతో నన్ను తూచి నా స్త్రీత్వాన్ని నిర్ణయించినట్లయితే నేను స్త్రీని కానని ఒప్పుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు. సాహిత్యసీమలో వివిధ రచయితలు, కవులు, విమర్శకులు రకరకాల బాటలు ఏర్పఱచుకొని, ఎవరి శక్త్యానుసారము వారు వాటికి అందచందాలను దిద్దుకుంటున్నారు. అందుచేత కొన్ని ముఖ్యమైన అంశాలు, అంటే అసలు 'నాటకం స్టేజిమీద వేయడానికి అనువుగా ఉందా లేదా అనేది ముఖ్యం. అలా స్టేజికి అనువుగా వ్రాసిన తరువాత వారివారి నాటక కన్యలను వారివారికి ఇష్టమొచ్చినట్లుగా అలంకరించుకోవడంలో తప్పేముంది? ఈవిధంగా ఆలోచిస్తే 'రావు' 'క్రీనీడలు' నాటకానికికావలసిన హంగులు—ఒక 'ఆధునిక డ్రాయింగ్ రూము'—'ట్రావెలర్సు బంగళాలో ఒక గది'. వాటిని ఏర్పఱచుకోవడం ఏమంత కష్టంకాదు. పాత్రల వేషభాషల విషయంలోకూడా,

సాంఘిక నాటకమే కనుక ఇబ్బందిలేదు. నాటకంకూడా గంటకు తక్కువకాకుండా, రెండు గంటలకు ఎక్కువకాకుండా వీలుగానే ఉంది.

అన్ని హంగులూ ఉన్నాయికదా ! ఇక లేనిదేమిటో దానిలో అంటే...ఏదో లేకపోవడమనే లోటుందనికాదు...ఇంకా ఏదో దానిలో ఉందనిపించింది. అదే 'Poetic touch' అనుకుంటాను. ఇలా ఎందు కంటున్నానూ అంటే 'రావు' వ్రాసిన 'గెలుపునీదే', 'అడుగు జాడలు' మొదలైన నాటకాలు ఇంకా తన ఇతర రచనలలో ఇది కనపడలేదు. 'తెలివిగా, హుందాగా బాగానే వ్రాస్తాడే ఇతను' అని పించింది. కాని ఈ 'క్రీనీడలు'లో రావులోని కవితాలక్షణం చూచా యగ స్ఫురించింది. కొన్ని వేల పద్యాలు ఛందోలోపంలేకుండా కేవలం ఒక చరిత్ర రూపంలోనే ఉంటే దాన్ని నేను కవిత్వం అనలేను. గద్యంలో కానీయండి, పద్యంలో కానీయండి, లేక గేయంలో కానీ యండి, మరోదేనిలోనైనా కానీయండి రచయిత ఒకఊపులో, ఉద్వే గంలో, ఒక ఆవేశంలో ఒక్క మాట దొర్లించినా, ఒక్క భావం వెల్ల డించినా అంతవఱకూ అది కవిత్వం అంటాను. అక్కడ ఆ రచయి తలో కవి తడతాడు నాకు. ఈ 'క్రీనీడల'లో కూడ, 'రావు' ఏదో ఊపులో ఎత్తినచేయి దించకుండా వ్రాసేసి, తరువాత దాని సంగతి ఆలోచించాడేమో అనిపిస్తుంది నాకు. రావు స్వతహాగా, సునా యాసంగా రచయిత కనుక, ఆ ఊపులోకూడా మాటల్ని తెలివిగా, హాస్యంగాపెట్టేసి అలవాటుచొప్పున అల్లుకుపోయుంటాడనుకుంటాను. మాటలు అంటే గుర్తుకొచ్చింది. 'రావు' మాటల కెప్పుడూ కొరత పడడు. ఏ భావాన్నైనా తకీమని మాటల్లోపెట్టేస్తాడు. ఆ expression ఉంది 'రావు'లో. కసిగాఉన్నప్పుడు 'వాసు'తో "విషపు పురుగువి; ద్వేషం, గర్వం కరుడుకట్టుకుపోయాయి నీలో; ఇవి పచ్చి నిజాలు" లాంటి మాటలనిపిస్తాడు.

"ఒక్క Request. కాదనకండి. నా 'క్రీనీడలు'కి పీఠిక వ్రాసి పెట్టాలి మీరు" అన్నాడు 'రావు' ఒకరోజున హఠాత్తుగా. 'నా అభిప్రాయాన్ని విడమర్చి చెప్పే శక్తి లేదు నాకు. ఏదైనా చదివాక గాని, చూచాకగాని ఏదైనా ఆలోచన వస్తే ఆలోచించుకుని ఊరు కుంటానంతే. నాకు నేను నాలో నేను అనుకున్నది పైకి విడమర్చి అందంగా చెప్పడం నాకు చేతకాదు. అయినా నా అభిప్రాయాన్ని మీ నాటకంతోపాటు ప్రచురణ కిచ్చే స్థోమత లేదు నాకు. సాహిత్య సేవలో వృద్ధులు, అనుభవజ్ఞులు చాలమంది ఉన్నారు. వారి నెవరి నైనా Request చేయండి" అన్నాను. అంతా విని "మీ అభిప్రాయంలో నాకు నమ్మకముంది. అందుచేత ఇవ్వండి" అన్నాడు 'రావు'. "అయితే మీకే చెబుతాను. వినండి సరిపోతుంది" అన్నాను. "ఆ చెప్పేదే ఒక్క కాగితంమీద వ్రాసిస్తే సంతోషిస్తాను" అన్నాడు. ఇక అతనితో వాదించే శక్తి లేక నాకు తోచిందేదో నేను వ్రాశాను. 'వ్రాశాను' అని ఎందు కంటున్నానంటే నాకు వ్రాయడంకంటే, వ్రాసుకోవడమే అలవాటు. అందుకనే ఈ మూడు నాలుగు పేజీ లలో, ఎక్కడా 'రావు' వ్రాసేన మాటల్ని, భావాల్ని ఎత్తిచూపించడం, వాటిమీదనే నాకు తోచింది చెప్పడానికి మాత్రమే నా శాయ శక్తులా ప్రయత్నించాను. అలా కాకుండా వ్రాసుకోవడమే జరిగినట్లయితే... "స్త్రీలు నాటక రంగంలోకి వచ్చి చెడటం, రాకుండా ఉంటే చెడకపోవడం" ఇలాంటి సందర్భాలలో అసలు మంచీ చెడు లలో అదొక్కటే చెడువనా?...ఈనాడు సాధారణంగా ప్రతి స్త్రీ, పురుషునికి పెండ్లి జరగటం, ఒక్క స్త్రీకి ఒక్క పురుషుడనేదాన్ని అందరమూ అంగీకరించుకున్నాం. ఇలాంటి ప్రత్యేక వివాహాలంటూ లేనికాలమూ ఉంది. సంస్కృతీ, నాగరికత పెరిగినకొద్దీ ఎన్నో మార్పులువచ్చాయి మంచి, చెడ్డలనిర్ధారణవిషయంలో. ఇప్పటికి ఇలా

ఉన్నాం. ఇకముందు ఎన్ని మలుపులుతిరిగి ఇంకెక్కడికిచేరతామో! ఈ రోజు స్త్రీచదువుకోవడం నాగరికత, మంచిపని. మొన్నటికి అది చేయ కూడని పని. మంచీ చెడులకు స్థిరమైన కొలత బద్ద ఏదీ? ఒక వ్యక్తి ఎదురుగా ఒకచే పొగిడేసి, ఆ వ్యక్తి అలా వెనుతిరగ్గానే నీచంగా విమర్శించడం చెడ్డపని కాదూ? తను చేసిన తప్పును ఇతరుల నెత్తిన రుద్దడానికి ప్రయత్నించడం నీచపు పనికాదూ? అందుకనే ఏ వ్యక్తికి ఆ వ్యక్తి తనను తాను పరిశీలించుకొని, తనకు తాను మంచి చెడులను నిర్ణయించుకోవలసివస్తోంది ఈ నాటి విశృంఖల పరిస్థితులలో. "ఇంత వఱకూ ఉన్న ఇది మన సంఘం. సంఘం గోడలు ఇవి. ఆపైది మన సంఘం కాదు' అని వేరుగా ఈనాడు మనం హద్దులు పెట్టుకోలేక పోతున్నాం. అందుచేత ఎవరికి వారు ఇతరులకు తమ వలన సాధ్య మయినంత వఱకు బాధ కలుగకుండ, నష్టంకలుగకుండ ఎవరికి తగిన బాటని వారు ఏర్పఱచుకొని ముందుకు గమనించాల్సి వస్తోంది...." ఎక్కడినుంచి ఎక్కడికో వెడుతున్నాను. అందుకే దీనిలో వ్రాసు కోవడానికి ప్రయత్నించనిది.

ఇంతకీ 'రావు' 'క్రీనీడలు' పూర్తిగా చదివాక అనిపించింది నాకు "పాపం పిల్లవాడు. పూర్తిగా తట్టుకోలేక పోయాడు ఊపుకు. తన పాత్రలే తనని తికమకపెట్టి గాభరాపెట్టి లాలించాయీ" అని. 'రావు'లో ఇంకాస్త పెద్దరికం, నిబ్బరంవచ్చి, తన పాత్రల్ని తన గుప్పెటలలో పెట్టుకుంటాడని ఆశిస్తున్నాను. ఉదాత్తమైన భావాలు, విశాల హృదయం కల పిల్లవాడుగా అవుపిస్తాడు 'రావు' నాకు. అందుకనే అతనికి నా అభిప్రాయం ఇవ్వడంకంటే, ఆశీస్సులను ఇవ్వా లని అనిపిస్తోంది నిజానికి నాకు. అతను ఇంకా ఇంకా వ్రాసి, పెద్ద వాడై, అభివృద్ధిలోకి రావాలని 'రావు'ని నేను మనః పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

రమాదేవి

# నమస్కారం

నా రచనల్లో ఎందుకనో "క్రీనీడలు"-ఆలోచననుంచి ఆఖరు వరకు వింతగా తోస్తుంది.

ఎన్నాళ్ళబట్టో నా కొత్త నాటకం కావాలని కోరుతూవచ్చిన మిత్రులు శ్రీ డి. రాజేశ్వరరావుగారు దాదాపు ప్రదర్శన తేదీని కూడా ముందే నిర్ణయించుకొని దీన్ని గబగబా పూర్తిచేయించారు.

1956 నవంబర్ 10 వ తేదీన సికింద్రాబాద్ సెంట్రల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ వారు-తమ సాంస్కృతిక విభాగాన్ని ప్రారంభిస్తున్న సందర్భంలో మొదటిసారిగా శ్రీ డి. రాజేశ్వరరావుగారు, మరికొందరు రైల్వే మిత్రులు దీన్ని ప్రదర్శించారు. 'ఇంకా కొత్త నాటకాలు వ్రాయాలి' అని ప్రోత్సహిస్తూవచ్చిన పూజ్యులు శ్రీ కపిల కాశీపతిగారు ఈ నాటక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరపడం నా సుకృత విశేషం.

ఆ తర్వాత 1956 డిశంబర్ 2 వ తేదిన హైద్రాబాద్‌లోని ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీయర్స్ భవనంలో జీ. వే. మ. బృందం వారిచేత రెండవ ప్రదర్శన ఇవ్వబడింది. దీనికి శ్రీ గోపీచంద్‌గారు ప్రారంభోత్సవం జరిపారు.

ఈ ప్రదర్శన నా జీవితంలోని మరో వింత అనిపిస్తుంది.

ఇన్నాళ్ళూ అదృశ్యంగావుండి తమ రచనలద్వారామాత్రమే నన్ను కదిలించి, నాలో అమితమైన ఆలోచనను కలిగించి, నాకు

వ్రాసే శక్తిని ప్రసాదించి, అడుగడుగునా నా మార్గాన్ని సరిదిద్దుతూ వచ్చిన గురుదేవులు శ్రీ గోపీచంద్‌గారు-ఈ నాటక ప్రదర్శనకు ప్రత్యక్షంగా వుండి, చూసి, ఆ పైన పుస్తకానికి పరిచయంకూడా వ్రాసి అమిత వాత్సల్యాన్ని చూపడం నా మహాభాగ్యంగా భావిస్తున్నాను.

మరోవింత : శ్రీమతి రమాదేవిగారు. 'క్రీనీడలు' వ్రాశాక వారు ఇందులో పాత్ర తీసుకొని ప్రదర్శిస్తే బాగుండుననే అభిప్రాయం బలంగా కలిగింది. పరిచయం ఎంత వున్నా-చదువులో, భావాల్లో, సంస్కారంలో చాలా ఉన్నతులు కావడాన—ఎందువల్లనో ఈ మాట వారితో అనలేకపొయ్యాను. అయితే-వారిది తీక్ష్ణమైన జ్ఞానం కావడంవల్ల-నా అభిప్రాయాన్ని గ్రహించారుకాబోలు—వారే స్వయంగా పూనుకొని ప్రదర్శనను ఏర్పాటుచేయించి దయతో 'సరళ' పాత్రను నిర్వహించడానికి అంగీకరించారు. శ్రీమతి రతన్‌ప్రసాద్‌గారు 'రాధ' పాత్ర తీసుకొని వారికి తోడ్పడ్డారు. వారు అలా ఇందులోని పాత్రలను నిర్వహించడంవల్ల ఈ నాడు ఎంతో మార్పుకు సూచనలు కనిపించాయంటే అతిశయోక్తి కాదు. పాత్రల మనసును ఆమూలాగ్రంగా అర్థంచేసుకొని దానికి తమ నటనద్వారా నిండుదనాన్ని చేకూర్చడంవల్ల ఆవాతావరణం కలుగ వచ్చని నానమ్మకం. అలాంటి వాతావరణాన్ని కల్పించగలరనేఆశే - బహుశా నాలో ఆఅభిప్రాయం కలగడానికి కారణంకావచ్చు. నా అభిప్రాయానికి వారు రూపాన్నిచ్చారు. అందుకే వింత అన్నాను. అంతేకాక-వారు ఈ నాటకాన్ని నిశితంగా పరిశీలించి ఆశీస్సుల నివ్వడం నాఅదృష్టం.

ఇక-ఈ నాటకాన్ని వినగానే నామకరణంచేసింది మిత్రుడు శ్రీ అత్తోట శివరామకృష్ణ. నాటకం చదవగానే 'తెలతెల్లవారింది'

అనే గీతం వ్రాసిచ్చింది శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారు. రెండవ గీతాన్ని వ్రాసిన మిత్రులు శ్రీ 'అజ్ఞాతుడు'. 'అడుగుజాడలు'కాగానే దీన్నికూడా వెలువరచాలనే ఆప్యాయతను చూపింది శ్రీ యల్లా ప్రగడ నారాయణరావుగారు. ముద్రణలో శ్రీ బడేసాహెబ్‌గారు, బ్లాకుల విషయంలో శ్రీ కోటేశ్వరరావు చాలా శ్రద్ధతీసుకున్నారు.

ఉత్తమ నటుడు శ్రీ రాజేశ్వరరావుగారు ప్రదర్శనల్లో పాల్గొనడమే కాక అడగగానే తమ అభిప్రాయాన్నిచ్చి కొత్త ఉత్తేజాన్ని కలిగించారు.

ప్రదర్శనల్లో పాత్రలు ధరించిన వారేకాక ఇతరమిత్రు లెంతోమంది తోడ్పడ్డారు. ముఖ్యంగా శ్రీ రామావతారంగారు చాలా శ్రమ పడ్డారు.

ఈ విధంగా ఈ నాటక రచనకు ఆలోచననుంచి ఆఖరువరకు పరోక్షంగా, ప్రత్యక్షంగా తోడ్పడ్డ పెద్దలు, మిత్రులందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపకుండా వుండలేను.

హైద్రాబాదు<br>5–4–1957

నరసింహారావు

10-11-1956 తేదీ 'క్రీనీడలు' ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరిపిన శ్రీ కపిల కాశీపతిగారితో సెంట్రల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ (సికింద్రాబాదు) వైజ్ఞానిక బృందం.



1956 నవంబర్ నెల 10 వ తేదీన సికింద్రాబాదు సెంట్రల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ ప్రదర్శనలో

| | |
|---|---|
| వాసు | — శ్రీ డి. రాజేశ్వరావు |
| డాక్టర్ | — ,, చలపతి |
| సీతాపతి | — ,, ఎ. వి. శేషారావ్ |
| శీను | — ,, పి. సుబ్బారావు |
| సరళ | — శ్రీమతి రాజేశ్వరి |
| రాధ | — ,, ఝాన్సీ |

1956 డిశంబర్ నెల 2 వ తేదీన హైద్రాబాద్‌లోని ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీయర్స్ భవనంలో జీ. వే. మ. వారు ఇచ్చిన ప్రదర్శనలో

| | |
|---|---|
| వాసు | — శ్రీ డి. రాజేశ్వరరావు |
| డాక్టర్ | — ,, కె. యల్. నరసింహారావు |
| సీతాపతి | — ,, అజ్ఞాతుడు |
| శీను | — ,, పి. సుబ్బారావు |
| సరళ | — శ్రీమతి రమాదేవి |
| రాధ | — ,, రత్న ప్రసాద్ |

సంగీతము

వీణ, ప్లేబ్యాక్ : శ్రీ పాలగుమ్మి విశ్వనాథం
ప్లేబ్యాక్ : శ్రీమతి పాలగుమ్మి సుమతి
వయొలిన్ : శ్రీ ఆంథోనీ మాథ్యూస్, వేణువు : శ్రీ టి. పార్థసారథి.

1956 ఫిబ్రవరి 20 వ తేదీన ఈ నాటకం ఆలిండియా రేడియో, హైదరాబాదు కేంద్రం ద్వారా అరగంట నాటికగా ప్రసారమయింది. అప్పుడు

| | |
|---|---|
| వాసు | — శ్రీ శ్రీనివాసరావు మంత్రి |
| డాక్టరు | — ,, జి. సత్యనారాయణ |
| సీతాపతి | — ,, డి. కోటయ్య |
| శీను | — ,, పి. సుబ్బారావు |
| సరళ | — శ్రీమతి ఎస్. నర్మదాదేవి |
| రాధ | — ,, యం. సత్యవతి |

ఇందులో

వాసు...

డాక్టర్...

సీతాపతి...

శీను...

సరళ...

రాధ...

వస్తారు

# క్రీనీడలు

## మొదటి రంగం

### డాక్టరు పతి ఇల్లు

[మేడక్రింది భాగం. ప్రేక్షకులకు మేడఎక్కే మెట్లు కనిపించే ఏర్పాటుంటే బాగు. లేదా—తెరలోపలినుంచి మెట్లున్నా—మేడ పై భాగాన బాల్కనీ దగ్గరికొస్తే ఈ హాలు వాళ్ళకు కనిపించేట్టుండాలి. పేరున్న డాక్టరనే భావం కలిగేట్టు వీలున్న పరికరాలన్నీ అమర్చాలి. కాలింగ్ బెల్, ఫోన్ మాత్రం తప్పనిసరి. అప్పుడప్పుడే తెల్లవారింది. సరళ సోఫాలో కూర్చొని ఏదో వ్రాయడానికి ఆలోచిస్తున్నది. బ్యాక్ గ్రౌండ్ న పాట]

తెలతెల్లవారింది - తొలిపొద్దు లేచింది
నలుదెసల వెల్గులూ - నాట్యాలు చేశాయి ॥తెల॥
రాత్రి చీకట్లలో - రగిలి నా కోర్కెలు
పగటి వెల్తురులోన - పరదాల దాగాయి ॥తెల॥
ఆరనీ ఆశలు - తీరనీ కోర్కెలు
మనుజ హృదయంలోన - మారాము చేశాయి ॥తెల॥
కలత నిద్దురలోన - కదిలినా కలలలో
కదను తొక్కాయెన్నో - అడివి జంతువులు ॥తెల॥
మనసులో ముసిరినా - మదమత్సరాలకు
బురాఖాను తగిలించి - మోసగించును మనుజుడు
తన్ను తా మోసగించును మనుజుడు ॥తెల॥

తృప్తి జెందని మనుజ నైజం
హద్దుమీరిన అతిశయంతో
ద్వేష విద్వేషాల విస్మరించక నెపుడు
జీవితాన్నొక నరక కూపంబు జేసింది ॥తెల॥

[ఈ పాట జరుగుతున్నంత సేపు సరళ వ్రాస్తున్న లేఖ తృప్తి చెందనట్టు చింపేస్తూ అవసర హావభావాలు ప్రదర్శిస్తుంది. లేదా - ఈ సన్నివేశాన్ని ఇలాకూడా ప్రదర్శించవచ్చు : పాట 1, 2 చర ణాలయ్యేవరకు హాలులో ఎవరూ వుండరు. 3, 4 చరణాలప్పుడు కాలింగ్ బెల్ మోగుతుంది. మేడమీది నుంచి శీను గబగబావచ్చి బయటికి వెళ్ళి చూస్తాడు. తిరిగి మేడ ఎక్కుతాడు. ఆఖరు చరణా లయ్యేప్పుడు మళ్ళీ కాలింగ్ బెల్ మోగుతుంది. మళ్ళీ శీను కింది కొస్తాడు. ఈసారి అతని వెనకాలే సరళకూడా వస్తుంది. శీను వార్త ను అక్కకు అందజేదామని మేడ ఎక్కబోతుండగా సరళ ఎదుర వుతుంది]

శీను : అక్కయ్యా ! మళ్ళీ ఎవరో వచ్చారు వాసుగారిని కలవాలని.

సరళ అబ్బబ్బ ! ఆ మాట నాతో పదే పదే చెప్పాలా ? ఇంకా నిద్ర లేవలేదని సమాధాన మివ్వలేప్పూ?

శీను : ఆమాటే చెప్పి పంపానక్కయ్యా. అయినా—నీకూ ఆవిషయం అందజేతామని.

సరళ : మళ్ళీ నాతో ఎందుకూ చెప్పడం. (బ్యాగ్ పక్కకు విసిరి చిరాగ్గా సోఫాలో కూలబడుతుంది) నాటకం ఎంత బాగుంటే మట్టుకు తెల్లవారే సరికి ఇంతమంది రావాలా కలుసుకోడానికి!

శీను : వస్తారక్కయ్యా వస్తారు. నటనంటే తడాఖా అనుకున్నావా ఏం? (వెధవ పోజ్‌లో ఒక పద్యం విసురుతాడు. అది-నటనను

గూర్చిన పద్యమైనా సరే. లేదా-పద్యమే నటనన్నట్టు ఏదో పద్యాన్ని ఆ ధోరణిలో చదివినా సరే.) అక్కా ! ఎలా వుంది పద్యం?

సరళ : ఏడిసినట్టుంది గాని నన్ను చిరాకు పరచకు (కాలింగ్ బెల్ మోగుతుంది) అదిగో-ఎవరో వచ్చారు చూడు. (శీను వెళ్ళి వస్తాడు.) మళ్ళీ ఎవరు?

శీను : ఇంకెవరు? మీ మహిళా సంఘ అధ్యక్షురాలు.

సరళ : శ్యామలాదేవిగారా? ఆమెకూడా వాసుగారిని కలుద్దామనేనా?

శీను : వాసుగారో, రాధగారోగాని-రాత్రే కంగ్రాచ్యులేషన్స్ చెబుదామనుకుందట. కాని వీల్లేక పోయిందట. అందుకని మొహమన్నా కడుక్కోకుండా ఇలా పాచిమొహంతో వచ్చేసింది. ఇంకాలేవలేదని చెప్పాను. అంతటితోపోవచ్చుగా? ఊఁ హూఁ-పోదే ! పోనీ-మీ అక్కగారు లేచారా? అని అడిగింది. ఎవరూ లేవలేదనిచెప్పడంలో చివరకు నేనుకూడా లేవలేదని చెప్పాను. ఎలా అక్కయ్యా?

సరళ : చాల్లే-తెలివితేటలూ, నువ్వూ. సమయం, సందర్భం లేకుండా గబగబా వాగేస్తావు. ఎలాగూ నటుడు దొరకనే దొరికాడు గదా అని నీ సోదంతా వాసుగారి దగ్గర కూడా సాగించేవు !

శీను : ఇంకా సాగంచే వేమిటి ! ఎప్పుడో సాగించాను. రాత్రే ఇంటికొస్తూ వస్తూ కారులో కొంత వరకు చెప్పేశాను. నిద్రపోబట్టి గాని—లేకుంటే పూర్తిగా అప్పుడే చెప్పేవాణ్ణి. అయినా—ఇప్పుడేంమునిగిపోయింది? ఇవేళ దాన్ని కంటిన్యూ చేస్తాను. అక్కయ్యా! ఈదెబ్బతో మనకిక నాటకాల్లో ఛాన్సు తప్పదు. నువ్వేదో రికమెండ్ చేస్తావనుకుంటే అలా నీరసంగా చెప్పే

శావు. ఎంత అన్యాయం, ఎంత అన్యాయం!... పోనీ-నువ్వు కూడా కాలేజీ రోజులనుంచీ నాటకాలను అలాగే వేస్తూవుంటే ఎంత బాగుండేది చెప్పు. నీకూ పేరొచ్చేది; నేనూ నటుణ్ణయ్యే వాణ్ణి. ఏమంటావు?

సరళ : ఏమిటీ—పదిమందిలో రంగుపూసుకొని తైతక్కలాడమన్నావా? పరువూ మర్యాదా లేకుండా అందరిముందూ...

శీను : వద్దక్కయ్యా! అంత భయంకరమైన అభిప్రాయాలు మన కొద్దు. నన్నిలా బ్రదకనీ. (ఇంతలో టెలిఫోన్ కాల్) అదిగో ఎవరో పిలుచుచున్నారు. చూడగలవాడనా అక్కా?

సరళ : అక్కర్లేదు - నేను చూస్తానుండు. (రిసీవ్ చేసుకుంటుంది) హాలో-ఎవరు? రామాయమ్మగారా?నమస్కారం... ఆఁ. సరళనే. అవునండీ. వాసుగారు, హీరోయిన్ వేషం వేసిన రాధగారు ఇద్దరూ ఇక్కడే వున్నారు....రాత్రంతా అలసిపోయి వుంటారు. ఇంకా నిద్రలేవలేదు. ఆఁ... మీకంగ్రాచ్యులేషన్స్ తెలుపమన్నారా? అలాగే... నో మెన్షన్. (రిసీవర్ పెట్టేస్తుంది)

శీను : ఇదీ ఆ పిలుపేనా అక్కయ్యా?

సరళ : తెలియలేదూ? (సోఫా దగ్గరికొస్తూవస్తూ)అందరికీ వాసుగారు, రాధగారు కావాలి. వాసు, రాధ; వాసు, రాధ; వాసు, రాధ కలవరిస్తున్నారు. (అలిసినట్టు చిరాగ్గా కుప్పకూలినట్టు సోఫాలో పడుతుంది. ఆ తర్వాత ఏదో వ్రాయ ప్రయత్నిస్తుంది.)

శీను : కలవరించడం కాదక్కా. నిజంగా ఇప్పుడు తెల్లవారింది.

సరళ : శీనూ! అనవసరంగా నన్ను చిరాకు పరచకు.

శీను : నేనా అక్కా నిన్ను చిరాకు పరిచేది? ఫోన్ కాల్సు రాకుండా రిసీవరు కనెక్షన్ తీసేసి, మనుషులు రాకుండా తలుపులు వేసె య్యనా ఏమిటి?

సరళ : వద్దు. ఏమీ చెయ్యొద్దు. నన్నిలా పడవనీ. అనవసరంగా మాట్లాడించకు.

శీను : కాని—ఒక షరతక్కయ్యా.

సరళ : ఏమిటది?

శీను : ఎలాగైనా వాసుగారికి నన్ను రికమెండు చెయ్యాలి.

సరళ : నిన్నా! ఏమని?

శీను : వాళ్ళట్రూపులోకి తీసుకోమని.

సరళ : చాలుగాని నీ పనేమిటో చూసుకో, పో.

శీను : నాకింకా వేరే పనేముందక్కయ్యా?

సరళ : (గట్టిగా) శీనూ !

డాక్టరు : (మెట్లుదిగి వస్తూ) ఏమిటిది దేవీ - ఇవేళేమో లేవగానే ఇంత చిరాకు?

సరళ : (వ్రాసే లేఖను దాచేస్తుంది) చూడు డాక్టర్! అసలే అడ్డమైన వాళ్ల ఫోన్ కాల్సుతో నేను చిరాకై పోతుంటే - మధ్య ఈ శీనుగాడొకడు.

డాక్ట : ఫోన్ కాల్సా! ఏమైనా అర్జంటు కేసులా? నాతో చెప్పనన్నా లేదేం?

శీను : నీకు కాదు బావా. వాసుగారికీ, రాధగారికీ. రాత్రి వారి నాటక ప్రదర్శన అద్భుతంగా వుందని కంగార్చ్యులేషన్స్ చెప్పడానికి ఇప్పటికి పట్టణంలోని ఏవందమంది పెద్దమనుషులో-

సారీ-పెద్దమనిషినులు కూడా వచ్చారు. పైగా ఎన్నో ఫోన్ కాల్స్.

డాక్టరు : అలాగా? అయితే చాలా సంతోషించాల్సిన విషయం. దానికి చిరాకెందుకు దేవీ?

సరళ : (కాస్త తబ్బిబ్బవుతుంది) ఆఁ-చిరాకా! చిరాకేముంది?

డాక్టరు : ఇందాక నీవన్నావులే. బహుశా మరిచిపోయి వుంటావు.

సరళ : అన్నానా? చిరాకులో అని వుంటాను.

డాక్టరు : కావచ్చు. కాని—వాళ్ళిక్కడికి రావడం నీకు చిరాకని చెప్పనే లేదేం?

సరళ : బాగుంది. వాళ్ళు రావడం నాకేం చిరాకు? పైగా-నేనే వాళ్లను మనింటికి రమ్మని ఆహ్వానించాను.

శీను : అందులో - వాసుగారు ఒకప్పుడు అక్కయ్య క్లాసుమేటట బావా. వీరిద్దరూ ఇంటరు చదువుతుండగా కలిసి నాటకాల్లో వేశారట. ఆ తర్వాత వాసుగారు నాటకాల్లో పడి ఇంటరు తప్పారట (దర్జాగా) నాలాగే. అక్కయ్య చదువులోపడి... (ఆ తర్వాత ఏమనాలో తోచదు.)

డాక్టరు : (అందుకొని) ఎవరిలాగా?

శీను : (క్షణం ఆలోచించి-బొత్తిగా పాడుపనన్నట్టు) మీలాగా-చదువులోపడి బి. ఏ. ప్యాసైందట. అక్కడ్నుంచి....

సరళ : శీనూ! ఈ సోదంతా నిన్నెవరు చెప్పమన్నారు?

డాక్టరు : ఇందులో సోదేముంది? చెప్పనీ.

సరళ : వాడేమీ చెప్పక్కర్లేదు. నాకు చిరాకేమీ లేదు.

డాక్టరు : దేవీ! నేనెంతో మంది పొట్టలు చీల్చి రోగాలను కనుక్కో గలిగాగాని-నీ మనసులో ఏ ముందో కనుక్కోలేక పోయ్యాను.

సరళ : మీ అందరి మనసులో ఏ ముంటుందో నా మనసులోనూ అదే వుంటుంది.

డాక్ట : కాదు. అంతకు మించిందేదో వుండాలి.

సరళ : అది మీ అనుమానం. అంతే.

డాక్ట : అనుమానమేమిటి దేవీ. అది నా స్వభావానికి విరుద్ధం. (ఫోన్ కాల్) అదిగో-ఎవరో పిలుస్తున్నారు. (రిసీవ్ చేసుకుంటూ) హలో...డాక్టరు పతీ స్పీకింగ్. గుడ్ మార్నింగ్... ఎస్. ఇక్కడే వున్నారు. ఇంకా లేవలేదండీ...అలాగే...నో మెన్షన్. (పెట్టేస్తూ) ఆఁ-వాణీమహల్ ప్రొప్రయిటరు వెంకటావ్రు నుంచి. మనం రాత్రే కాసేపు వాళ్ల నక్కడే వుండనిస్తే బాగుండిపోను. అంతా కలిసేవారు పాపం. రంగైనా కడుక్కో నివ్వకుండా కారెక్కించావ్.

సరళ : బాగుంది. ఆ లెక్కనైతే రాత్రి మూడు గంటలైనా ఇల్లు చేరే వాళ్ళం కాదు.

డాక్ట : ఎలాగైనా వాళ్లను డిజప్పాయింట్ చేశాం.

సరళ : ఇందులో పెద్ద డిజప్పాయింట్ చేసిందేముందో! అంత బాగుం దనుకున్న వాళ్లు ఇప్పుడైనా కంగ్రాచ్యులేషన్స్ తెలుపుతారుగా?

డాక్ట : అవుననుకో. కాని-అప్పటికీ ఇప్పటికీ తేడా లేదూ? (మళ్ళీ ఫోన్ కాల్) హలో...ఎవరండీ...రాజారావ్ గారా! నమస్కారం...ఆఁ. మీ పిల్లవాడా! ...వస్తున్నాను వస్తున్నాను. (రిసీవరు పెట్టేస్తూ) శీనూ ! డ్రైవర్ని కారు బయటికి తీయమను. (శీను వెడతాడు) ఇన్ కమ్ టాక్స్ రాజారావ్ గారి పిల్లవాడు వేడివేడి కాఫీ ఒంటిమీద పోసుకున్నాడట. వెళ్ళొస్తాను.

అవసరమైన పరికరాలను మెడికల్ బ్యాగ్‌లో సర్దుకుంటూ)
అన్నట్టు-నువ్వు కాఫీ తీసుకున్నావా?

సరళ : తీసుకొనే కిందికొచ్చాను.

డాక్ట : ఆఁ-వాళ్ళు లేవగానే కాఫీ ఇస్తావుకదూ?

సరళ : ఏమిటా అనడం? నేనెందు కిస్తాను? ఇప్పిస్తాను.

డాక్ట : దేవీ! నీవు అర్థంకాని దానివేకాదు; అమాయకు రాలివి కూడాను. నేనెంతో మంది పొట్టలు చీల్చి...

సరళ : ఇక ఆపండి. ఇప్పటి కీ మాటన బట్టి ఇవేళకు నాలుగోసారి.

డాక్ట : సారీ. అన్నట్టు-కాఫీకి నేను లేనని వాళ్ళేమైనా అనుకుంటా రేమో. క్షమించమని చెప్పు.

సరళ : ఏమిటి పేద్ద... ఈ మాత్రానికే వాళ్లు మిమ్మల క్షమించాలా ఏమిటి?

డాక్ట : (దగ్గరగా వెళ్లి) పోనీలే. ఏమిటది వాిస్తున్నట్టున్నావ్?

సరళ : ఇది నా పర్సనల్ విషయం.

డాక్ట : అయాం సారీ. దేవీ! నేనెంతో మంది పొట్టలు చీల్చి...(కారు హారన్)

సరళ : చాలిక_వెళ్ళిరండి.

డాక్ట : ఆఁ-వస్తామరి. (మెడికల్ బ్యాగ్‌తో వెడతాడు)

శీను : (వచ్చి) ఎక్కడి కక్కయ్యా-బావ వెళ్ళింది?

సరళ : అదేమన్నా ఇవేళ కొత్తా?

శీను : కాదకక్కయ్యా. అర్జంటు కేసేమిటీఅని.

సరళ : ఏదో ఒకటి. ఊరికే నన్ను వాగించకు.

శీను : వాగేవాణ్ణి నేనుండగా నీకెందు కక్కయ్యా అంత బాధ?

సరళ : అబ్బబ్బ! నీ అసందర్భపు వాగుడుతో నాకు సగం తలనొప్పి లేస్తున్నది.

శీను : ఈ ఇంట్లో సందర్భంగా ఎవరు మాట్లాడుతుంటారో, అసం దర్భంగా ఎవరు మాట్లాడుతున్నారో తెలియడం లేదు.

సరళ : కోపం వచ్చిందా శీనూ? ఇలారా. (తల నిమిరి) అప్పుడప్పుడూ నేను చిరాకు పడుతుంటాను కదూ?

శీను : పడితే పడ్డావుకాని—చిరాకు పడుతూ కూడా చిరాకు కాదం టావు. అదే నీతో వచ్చిన చిక్కు.

సరళ : నీకేమీ అర్థం కావడం లేదు కదు శీనూ?

శీను : సరిపోయింది. కొన్ని కొన్ని విషయాలు నువ్వు చెబితేనే నా బుర్ర కెక్కవు. ఇక చెప్పకుండానే అర్థం కమ్మంటే ఎలా అవుతాయి?

సరళ : అవును శీనూ. నేను అర్థంకాను. అప్పుడప్పుడు నేనే అను కుంటూ వుంటాను ఏం చేస్తున్నానా అని. (కాలింగ్ బెల్ మోగుతుంది) అదిగో-మళ్ళీ ఎవరో వచ్చారు.

శీను : ఈసారి అసలు వాళ్ళు మనింట్లో లేనే లేరని చెప్పనా ఏమిటి?

సరళ : పైగా అదొకటా? ఏమిటో ముందుకనుక్కో-(శీను వెడతాడు)

శీను : (సీతాపతితో వస్తూ) వాళ్ళ ట్రూపులో వారేనట. ఏకంగా లోపలికే తీసుకొచ్చాను. నేనిప్పుడే వస్తాను. (సీతాపతి సరళకు నమస్కరిస్తాడు. ఆమె నమస్కరిస్తుంది. సీతాపతి కుర్చీలో కూచుంటాడు. శీను ఇంట్లోకి పోతాడు)

సరళ : కూచొండి...ఎవరి కోసం వచ్చారు? వాసుగారి కోసమేనా?

సీతా : అవునండీ. మళ్ళీ రేపు రాత్రికి నాటక ప్రదర్శనవుంది కదండీ. దానికి ఇప్పుడేమైనా రిహార్సల్స్ వుంటాయేమో కనుక్కుం

దామని వచ్చాను. లేవంటే అంతా సిటీ చూడడానికైనా వెడతామంటున్నారు.

సరళ : అయితే-వారినిప్పుడు లేపమన్నారా?

సీతా : లేపడం ఎందుకు లెండి. లేచాకే చెప్పొచ్చు.

సరళ : బహుశా ఇక లేవవచ్చును కుంటాను. పొద్దెక్కింది. అన్నట్టు మీరుకూడా వారి నాటకాల్లో వేస్తుంటారా?

సీతా : ఏవో చిన్నవి. అయినా మా అమ్మాయివుంది.

సరళ : ఎవరు? రాధగారా?

సీతా : అవును.

సరళ : మీరేనా వారి ఫాదర్! వారి ఫాదర్ ఉన్నారని చెప్పారే కాని-రాత్రి వారితో రాలేదేమో అని ఆలోచించాను.

సీతా : చాలా పొద్దు పోయిందని అక్కడే ఉండిపోయాను.

సరళ : బహుశా వాసుగారు మీ బంధువు లనుకుంటాను.

సీతా : లేదండీ. బంధుత్వమేమీ లేదు.

సరళ : అలాగా? అయితే-కొత్త సంబంధమన్నమాట?

సీతా : సంబంధమంటే కొద్దిపాటి పరిచయం. అంతే. నాటకాలకు ఆడవాళ్ళు లేరని బాధపడుతూ వుండేవారు. మా రాధకు నాటకాల్లో వేయాలని అభిలాష. నిజానికి రాధనిలా పంపడం నాకంతగా ఇష్టంలేదు. అయినా-వాళ్ల అభిరుచులను మాత్రం ఎందుకు కాదనాలని అంగీకరించాను. అక్కడికి ఒంటరిగా పంపడం ఇష్టంలేక నేనూ వెంట వచ్చాను. ప్రస్తుతం ఎవరో మనిషి తక్కువైతే వాళ్ళ అవస్థ చూడలేక వేషానిక్కూడా సరదాగా ఒప్పుకున్నాను. అంతేకాని—వాసుగారికీ, మాకూ ప్రత్యేక సంబంధమేమీ లేదు.

సరళ : అయితే-నేను విన్నదంతా అబద్ధమన్నమాట?

సీతా : ఏం విన్నారేమిటి?

సరళ : ఏదో విన్నాలెండి. ఇంకెందుకూ? అది అబద్ధమని తేలింది. అబ్బ! ఏం లోకమండీ. అర్థంలేకుండా ముడిపెట్టేస్తుంది.

సీతా : మీరు చెప్పేది నాకర్థం కావడంలేదు. మనను గురించి లోకం ఏమనుకుంటుందో తెలిస్తే బాగుకదండి?

సరళ : బాగేననుకోండి. కాని—బాగుతో పాటు బాధకూడా వుంటుం దేమో?

సీతా : బాగనేది వున్నాక బాధపడ్డా ఇబ్బందిలేదు. మీ కభ్యంతరం లేకుంటే చెప్పండి.

సరళ : నాకేం అభ్యంతరం? అయినా-ఇంత దూరం వచ్చాక చెప్పక పోతే నిజంగా బాధపడ్తారు. ఏంలేదు. వాసు, రాధగార్లకు వివాహం జరుగుతుందని విన్నాను. అందుకే ఒంటరిగా తిరుగు తున్నారనీ, మీకు ఇష్టమయ్యే అలా అవకాశం కన్పిస్తున్నా రనీ అనగా విన్నాను. దీనికి తోడు—రాత్రి వారితో మీరు నాకుంటే—చెప్పొద్దూ—నేనూ నిజమేనని నమ్మాను. అనుకున్న మాట చెప్పినందుకు క్షమించాలి.

సీతా : ఈ మాత్రానికి క్షమాపణా! అయితే-చాలా ఆశ్చర్యకరమైన విషయం. నేనెప్పుడూ మా రాధను అతనికిద్దామనుకోలేదు. రాధ మనసు నాకు తెలుసు. అదెంత ఒంటరిగా ఉన్నా తనను తాను సంబాళించుకోగలదని నా నమ్మకం.

సరళ : నిజమేననుకోండి. మన మంచితనమే అక్కరకురాదు చూడండి.

సీతా : వాసుగారు కూడా అలాంటివారు కారు.

సరళ : కావచ్చు. బహుశా ఇప్పుడు స్వభావం మారివుండవచ్చు.

సీతా : మీకూ, వాసు గారికీ పరిచయమా?

సరళ : మీలాంటి పరిచయమే. అసలు—మీ భావాలు చూస్తే మా నాన్న గుర్తుకొస్తున్నారు.

సీతా : ఏం—అలా అన్నారు?

సరళ : నాకూ ఒకప్పుడు రాధగారి లాగానే నాటకాల్లో వేయాలని అభిలాష వుండేది. మీలాగే మా నాన్నగారు కూడా నా అభిలాష నెందుకు చిన్న బుచ్చాలని పదే పదే పోరాడుతున్న ఈ వాసుగారితో నటించడానికి ఒప్పుకున్నారు. నాన్నకు నమ్మకం కలిగాక- ప్రత్యేకంగా నాకు వేరే రిహార్సల్స్ కావాలన్నారు. సరె-అదంతా ఒక గాధ. నాన్నకు తెలియకుండా ముళ్ళమీది నుంచి బయట పడేసరికి గగనమైపోయింది. నాకిక అప్పట్నించి నాటకాల్లో వేయడమంటే రోత పుట్టింది. పరువు మర్యాద కావాలనే వారు అందులో నిభాయించడం కష్టమనిపించింది. సరె—అదంతా నా అనుభవం. బహుశా—వాసుగారు ఇప్పుడు తియ్యగా మాట్లాడడం మానేసివుంటారు.

సీతా : ఏమిటీ. ఇంకేమీ చెప్పకండి. నాకేమీ తోచకుండా వుంది. దీని వెనకాల ఇంత గొడవ వుందని నేనెన్నడూ కలగన్లేదు. సరె— లేవగానే మా రాధను వెంటనే రమ్మని చెప్పండి.

సరళ : కొంపదీసి రేపటి నాటకం ఆపించరు గదా?

సీతా : కాస్త దయచేసి మీరు రాధనైతే పంపండి. వస్తామరి.

సరళ : అదేమిటండీ. ఎందుకొచ్చినట్టు? ఎందుకెడుతున్నట్టు?

సీతా : అంతకైతే ఆయనకు రిహార్సల్స్ విషయం చెప్పండి.

సరళ : సరే. మంచిది. మీ ఇష్టం. నమస్కారం.

సీతా : నమస్కారం. (వెడతాడు. నెమ్మదిగా శీను వస్తాడు)

శీను : అతన్ని పంపినట్టున్నావు?

సరళ : వెళ్ళకేంచేస్తాడు? నిజం చెబితే ఎవరికైనా కష్టమేగా!

శీను : అదేమిటి అక్కయ్యా. నీవు నిజంచెప్పడమేమిటే !

సరళ : ఏమిట్రా ఆ మాటలు? నేను నిజం చెప్పక అబద్ధం చెబుతున్నాననా?

శీను : ఓహో—నా మాటల్లో అంత అర్థముందన్నమాట? ఫర్వాలేదు. అది కాదక్కయ్యా. నీ మనసులోని నిజమేమిటో తెలియక నేగా బావ నానా అవస్థా పడుతున్నాడు.

సరళ : బావ. బావకు ప్రతిదీ లైట్‌గానే వుంటుంది. ఎంతసేపూ ఆయనకు పేషెంట్లు, రోగాలు, ఆపరేషన్లు తప్ప అక్కయ్య సంగతే అక్కర్లేదు.

శీను : అదేనట బావ కర్థంకాంది. అయినా—ఇప్పుడు నీకేం తక్కువయిందే? నీవు కావాలనుకొన్న బంగళా, చుట్టూ తోట, బాగా పేరున్న డాక్టరు, ఇద్దరికీ చెరో కారు, పిలిస్తే పలికే బంట్రోతులు, అన్ని సంఘాల్లో పెద్దరికం. ఇవ్వన్నీ ఉన్నాయిగా. ఇంకేం కావాలి?

సరళ : ఏమిట్రా - అవన్నీ నేను కావాలన్నానా?

శీను : నువ్వు అన్లేదులే. నేనే అనుకున్నా.

సరళ : ఇలారా శీనూ! (తల నిమురుతూ) అప్పుడప్పుడు అయోమయంగా మాట్లాడ్తావెందుకురా?

శీను : ఆ విషయం తెలిసే ఎందుకు మాట్లాడ్తావో అర్థంకాదు.

సరళ : అవును శీనూ-అర్థంకాదు. ఒక్కొక్కప్పుడు నాకేఅర్థంకాదు. అర్థమయితే సీతాపతిగారితో అలా మాట్లాడిఉండను.

శీను : ఏం మాట్లాడ్తున్నావేమిటి?

(వాసు—మేడ మెట్లు దిగి వస్తూనే)

వాసు: నమస్కారం మిసెస్ సరళా, మిస్టర్ శ్రీనివాసరావ్.

సరళ : నమస్కారమండీ. రండి. ఇలా కూర్చోండి. (వాసుకు సోఫా చూపుతుంది. కూచుంటాడు. శీను దూరంగా నుంచుంటాడు).

శీను : అదేమిటి? కుర్రాళ్ళకి ముందు నమస్కారం చేస్తారా? తప్పేమోకదండి?

వాసు: ఆ రోజులు పోయాయి బ్రదర్. రా-ఇలా కూర్చో. (పక్కన కూర్చోబెట్టుకుంటాడు). చాలా పొద్దుపోయినట్టుంది. లేప వన్నా లేదేమండీ?

శీను : ఎందుకూ? పాపం-రాత్రంతా అలిసిపొయ్యారు.

వాసు: అయితేమాత్రం. ఒకరింటికొచ్చి పొద్దెక్కేదాకా ఇలా మొద్దు నిద్రపోవడం ఏం బాగు? అందుకే-మా బసలోనే వుండిపోతా మంటే కాదన్నారు.

సరళ : ఏం-ఈ ఇంట్లో ఏమైనా కష్టంగా వుందా?

వాసు: ఎంతమాట ! మీకు కష్టం కలిగించామేమోనని.

సరళ : మీరింత మాటంటారనుకోలేదు. ఇలాంటి సదవకాశం లభించడం మా భాగ్యమనుకొన్నాను.

వాసు: అదంతా నమ్మమనే.

సరళ : నమ్మకపోతే అది మా తప్పుకాదు. నిజంగా మీరు పొద్దున్నే లేచిఉంటే తప్పకుండా నా మాట నమ్మేవారు.

వాసు: అదెలా?

శీను : ఎలా ఏమిటండీ. రాత్రి మీ నాటక ప్రదర్శన అద్భుతంగా

ఉందని చెప్పడానికి ఎందరు వచ్చారో, ఎన్ని ఫోన్‌కాల్సో లెక్కలేదు.

సరళ : వాడు చెప్పేది అబద్ధమనేగా మీ నమ్మకం. అబద్ధం కాదని నేను సాక్ష్యం. ఇప్పుడైనా ఒప్పుకుంటారా మీరు మా ఇంటికి రావడం మా భాగ్యమని?

వాసు: మీ ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నా-మరేం చేయగలనుగనుక? అయినా-అంతగా పొగడడం మంచిది కాదనుకొంటాను.

సరళ : బాగుంది. ఇలా అంటే అలా అంటారు.

వాసు: పోనివ్వండి ఆ విషయం. ఇంకే విషయాలైనా చెప్పండి. అన్నట్లు—డాక్టర్ గారు ఎటు వెళ్ళారు?

సరళ : డాక్టర్ల పనేముంటుంది? పేషంట్లదగ్గరికెళ్ళడమేగా. వెళ్ళారు. శీనూ ! వెంకన్నను రెండు కాఫీలు తెమ్మను.

శీను : వెంకన్న తేవడమేమిటక్కా ! నేనే తెస్తాను. (ఇంట్లోకెడతాడు).

వాసు: రెండే తెమ్మన్నారు. మీరు తీసుకున్నారేమిటి?

సరళ : అవి మనకేగా.

(రాధ వస్తున్నదా అన్నట్టు వాసు పైకి చూస్తాడు)

సరళ : ఓహో-ఆమెకోసం చూస్తున్నారా? ఆమెలేకుండా తీసుకోరా ఏమిటి?

వాసు: అది కాదనుకోండి. వస్తున్నట్టుతోస్తే చూశాను.

సరళ : ఇంకా లేదులెండి. మీతో కలిసి తీసుకోడానికి నేనున్నానుగా?

వాసు: అవుననుకోండి.

సరళ : మీరీమధ్య కలవక చాలారోజులైంది. బహుశా మరిచేపొయ్యా రనుకుంటాను.

వాసు: అదేలా? ఉండవలసినంతవరకు జ్ఞాపకమున్నారు.

సరళ : అంటే?

వాసు: అంటే ఏముందీ? ఆ పైన జ్ఞాపకముంచుకునే అర్హత లేని దాన్ని మరిచిపొయ్యాను.

సరళ : మీ మాటలు మరిచారుకాదు.

వాసు: బహుశా స్వభావాలు అంత త్వరగా మారవనుకొంటాను మిసెస్ సరళాదేవిగారూ.

సరళ : అబ్బా. ఎంత పొడుగ్గా పిలిచారు! మనం చదివే రోజుల్లో ఇలాగేనా పిలిచేవారు?

వాసు: ఆ రోజులు వేరు. అప్పుడు మధుర స్వప్నాలను కంటున్న మిస్ సరళ. ఇప్పుడు స్వప్నాలను ఈడేర్చుకొన్న మిసెస్ సరళాదేవిగారు. దానికీ, దీనికీ ఏం పోలిక?

సరళ : ఊఁ. నా మనస్సును గ్రహించినవారిలాగే మాట్లాడారే! నా స్వప్నాలను మీకు చెప్పానా ఏమిటి?

వాసు: అనుకున్నాను మీ పోకడనుబట్టి.

సరళ : అది నా తప్పుకాదు. (శీను రెండు కాఫీలు తెస్తాడు. ఒకటి వాసువైపు జరుపుతుంది. మరోటి తాను దగ్గఱకుతీసు కుంటుంది. ఇంతలో రాధ మెట్లు దిగివస్తూ)

రాధ : నమస్కారమండీ. [సరళ—రాధను చూడనట్టు నటిస్తుంది.]

వాసు: [తన దగ్గరలో వున్న సోఫా చూపుతూ] ఇలాకూర్చోండి.

రాధ : పర్వాలేదు (దూరంగా వున్న కుర్చీలో కూచుంటుంది. వాసు_

తన కాఫీ ఆమె కందిస్తాడు. ఆమె వద్దంటుంది. అయినా—బలవంతంగా ఇస్తాడు.)

సరళ : తెప్పిస్తాను. శీనూ! మరో కాఫీ పంపించు. (శీను వెడతాడు. సరళ—తన కాఫీని బలవంతంగా వాసుకిస్తుంది. తిరిగి రాధ—తన కాఫీని సరళ కందిస్తుంది. కాని-ఆమె తీసుకోదు.) మీతో చాలా మాట్లాడుదామనుకున్నాను వాసుగారూ! (రాధవైపు క్రీగంట చూస్తుంది)

వాసు: తప్పకుండా. అలాగే మాట్లాడండి.

రాధ : ఇప్పుడే వస్తాను. (కాఫీ అక్కడ పెట్టి లేవబోతుంది.)

సరళ : ఎందుకూ లేచి వెడతారు? కూర్చోండి. రహస్యాలేమీ కావులెండి.

వాసు: ఈ చమత్కారం ఎప్పుడు నేర్చారు? అయితే ఇప్పుడే మాట్లాడకూడదూమరి?

సరళ : మరెప్పుడైనా మాట్లాడుతాను.

వాసు: అలాగే.

సరళ : తప్పకుండా కలుస్తారుగా?

వాసు: ఎక్కడికి పోతున్నానుగనుక? ఇంకా-రెండు, మూడు రోజులు మీ వూళ్ళోనే వుంటున్నాంగదండి?

సరళ : అయినా-కలిసే అవకాశ ముండాలిగా? అన్నట్టు-ఇందాక—మీ నాటకాల్లో వేసే వారే నట—ఎవరో వచ్చి వెళ్ళారు.

వాసు: ఎవరతను?

సరళ : ఎవరో నాకేం తెలుసు? కళ్లజోడుంటుంది.

రాధ : ఓ-మానాన్నె కావచ్చు. ఎందుకొచ్చారో?

సరళ : మరేం కంగారు పడకండి. ఏం లేదు. తిరిగి ఇవేళ నాటకం వుంచేమో కదండి?

వాసు: అవును. మీకు తెలియందేముంది? స్కూలుకమిటీవారు-రెండు నాటకాలు కావాలన్నారు.

సరళ : అదే—ఆ నాటకానికి రిహార్సల్స్ ఇప్పుడున్నాయో, లేవో తెలుసుకుందామని వచ్చారట.

రాధ : అవును. వెడదామంటారా?

సరళ : అదేమిటీ—అంత తొందర పడతారు?

వాసు: ఇందులో తొందరేముందీ? ఎలాగూ వెళ్ళాలిగా?

సరళ : అవుననుకొండి. (కాఫీ వస్తుంది. సరళ, శీను చెరో కప్పు తీసుకుంటారు.)

శీను : (కప్పు చేతిలో పట్టుకొని—ఒక పోజులో) కాఫీని గురించి పద్యం చదవనా? (ఎవరి సమాధానం కోసమూ ఆగడు. ఎత్తుకోనే ఎత్తుకుంటాడు.)

సరళ : (కట్ చేస్తూ) చాల్లే-సబబు, సందర్భం లేకుండా ఏమిట్రా ఆ వాగుడు?

శీను : ఇందులో సందర్భం లేకపోవడమేమిటి అక్కా? అక్షరాలా చేతిలో కప్పుంది.

సరళ : అబ్బబ్బ. ఇదండీ రోజూ మావాడిగోల.

వాసు: నిన్న చెప్పాడులెండి తన ఆత్మకథ.

శీను : ఇంకా పూర్తి కాలేదండీ. అలా నాకు నాటకాల్లో ఎంత అభిలాషవున్నా - ఇలా కప్పలోపడ్డ నూతివలె.

రాధ : నూతిలోవున్న కప్పవలె.

శీను : క్షమించాలి. పోర్షన్ సరిగా రాలేదు.

సరళ : వాడికి ప్రతిదీ రంగస్థల వేదిక; వాడు నటిస్తున్నట్టే లెక్క.

శీను : ఏమండీ! అది తప్పంటారా నటకాగ్రేసరా?

వాసు: ఎలా అంటాను స్వామీ.

(ఫోన్‌కాల్ వస్తుంది)

శీను : అదిగో-ఎవరో పిలుచుచున్నట్లు దోచుచున్నది. ఎవరుకాబోలు?

రాధ : క్షాబోలు కాదు. కావచ్చు.

శీను : అవునవును. ఇదే విందునుగాక. (వాసు, రాధలను చూసి) మీకేననుకుంటాను. (రిసీవ్ చేసుకుంటూ వెకిలిగా) హల్లో... (అవతలినుంచి చివాట్లు వచ్చిన ధోరణిలో మొహం పెట్టి) అక్కయ్యా! నిన్నే పిలుచుచున్నారు. ఏమనిచెప్పగలవాడను?

సరళ : ఏమని చెప్పడమేమిటి నీ మొహం. (సరళ ఫోన్‌దగ్గరి కెళ్ళి) హాలో...హనుమాయమ్మగారా? నమస్కారం. ఏమిటీ-మనం కనీసం వందరూపాయలవైనా అమ్మాలన్నారా? ఆఁ... మీరు బయలుదేరుతున్నారా?...వస్తాను. (రిసీవర్ పెట్టేస్తూ) ఆఁ, మీ నాటక వ్యవహారమే. మా మహిళాసంఘం—వంద రూపాయల టిక్కెట్లమ్మాలని స్కూలు కమిటీవారు రిక్వెస్టు చేశారట. వెళ్ళిరమ్మంటారా?

వాసు: అది నన్నడగవలసిన ప్రశ్న కాదనుకొంటాను.

సరళ : ఫర్వాలేదు. అన్నట్టు-క్షమించాలి. ఎవరూ లేరనుకోకండి. బహుశా—ఇప్పుడే డాక్టరు వస్తారు. ఉండండి.

శీను : అందాకా నేనుంటున్నాగా?

సరళ : వద్దు. అనవసరంగా వారిని వేధించకు. నీతోపనుంది.వచ్చెయ్.

శీను : ఆ తర్వాత పోర్షనేమిటి? పద. (ఇద్దరూ వెడతారు).

వాసు: ఏమిటండీ—అంత దూరాన కూర్చుండిపోయ్యారు? ఇలారండి. (తనకు దగ్గరున్న సోఫాను చూపుతాడు. ఆమె వచ్చి కూచుంటుంది.)

రాధ : అనువుగానిచోట అధికులమనరాదన్నారు.

వాసు: ఇందులో అనువుగానిదేముంది? అధికు లెవరు?

రాధ : బహుశా-వారే అధికులు కావచ్చు. ఇందాక నేను మేడ దిగి వస్తూ వారికి నమస్కారంచేశాను. గుర్తుందిగా?

వాసు: అవును.

రాధ : తిరిగి వారు నమస్కారంచేయడం బహుశా నామోషీ అనుకొనివుంటారు.

వాసు: అదేమిటండీ. చూడలేదేమో?

రాధ : చూడనట్టు నటించారంటే ఒప్పుకుంటాను. అయినా-పిలిచి చెప్పాకదండి.

వాసు: అవుననుకోండి. దాన్నిబట్టేనా మీకి నిర్ణయానికొచ్చారు?

రాధ : అంతేకాదు. నిన్న నేను ఒక సందర్భంలో వారి పక్కన ఇలా కూర్చోడానికి ప్రయత్నించాను. అక్కడ్నుంచి ఏదోవిధంగా లేపారు. మరోచోట కూచున్నాను. అక్కడ్నుంచీ లేపారు. ఇక—అక్క డెక్కడో దూరంగా కూచున్నాక ఏమన్లేదు. అందుకనే ఇప్పుడూ అలా కూచున్నాను. వారి ఉద్దేశ్య మేమిటో నా కర్థంకాలేదు.

వాసు: అతిశయమైఉండాలి. అంతకన్నా ఏమీ వుండదు. కాలేజీలో చదివే రోజుల్లోకూడా-తనకన్నా తెలివితక్కువవాళ్ళనిభావించి నప్పుడు—వాళ్ళను తెగ ఏడిపించడానికి ప్రయత్నించేది. తెలివి

కలవాళ్ళను చూస్తే ఈర్ష్య పడేది. మాతోపాటు నాటకాల్లో వేసేటప్పుడు ఈమెతో మెలగడం మాకు చాలా కష్టమయ్యేది.

రాధ : ఏం?

వాసు: ఏముందీ? నాటకాల్లో పేరు తెచ్చుకోవాలని వల్లమాలిన ఆసక్తి పాపం. నటించగల శక్తి సామర్థ్యాలుకూడా ఉండేవి. అయితే ఏం? ఇతరులు చెప్పడం నచ్చేదికాదు. తన తెలివికి ఏదో దెబ్బ తగిలినట్టు భావించేది. ఆ స్వభావం ఇంకా మారలేదన్నమాట.

రాధ : ఇంత బంధాల్లో చిక్కుకొని మనం ఇక్కడెందుకూ ఉండడం?

వాసు: ఎన్నాళ్ళుండబోతున్నామని? 1, 2 రోజుల దానికి బాధ పడితే ఎలా? ఓపికపట్టాలి మరి.

రాధ : ఏం ఓపికో, ఏమిటో. నాకు ముళ్ళమీద ఉన్నట్టుగా వుంది— ఈమె ప్రవర్తన చూస్తే.

(బయటనుంచే డాక్టర్ పాట గొణుక్కుంటూ హుషారుగా వస్తాడు. పాట : 'నాకు నేనే సాటీ—ఇలలో నాకు నేనే పోటీ'. వాసు, రాధలు లేచి నమస్కరిస్తారు).

డాక్ట : కూర్చోండి, కూర్చోండి. ఎందుకంత భక్తి? (మెడికల్ బ్యాగ్ బల్లపై వుంచడం, కోటు విప్పడం జరిగాక సోఫాలో కూచుంటాడు)

వాసు: మా పాటను మీరు పట్టేశారే!

డాక్ట : అదే నన్ను పట్టేసిందేమో. అసలు నేను ఏ నటుణ్ణో, గాయకుణ్ణో కావలిసింది. ఖర్మకాలి డాక్టర్నయి కూచున్నాను.

రాధ : అదేమిటి! అలా అనుకొని ఇలా చేశారు?

డాక్ట : స్వయంగా మనం నటులమయ్యే యోగం లేదని గ్రహించి–ఇందులో పడ్డాను. కాస్త కాస్త అవాసనై తేడుంది కాబోలు–ఈ పాట పట్టుబడింది.

రాధ : నా కది నాలుగు రోజులు ప్రాక్టీస్ చేస్తేగాని రాలేదు.

డాక్ట : నాకు మాత్రం పూర్తిగా వచ్చిందా ఏమిటి? పూర్తిగా నాకది నేర్పిపోవాలి మీరు.

రాధ : అలాగే.

డాక్ట : అన్నట్టు–పాతవాళ్ళతో మాట్లాడినట్టు మాట్లాడేస్తున్నాను. అదే-నాతో వచ్చిన చిక్కు. ఇంతకూ మీరు కాఫీ గట్రా... వెంకన్నా !

వాసు: తీసుకున్నామండీ. సరళగారు ఆ వ్యవహారమంతా చూశారు.

డాక్ట : ఈమె ఎక్కడి కెళ్ళిందేమిటి?

రాధ : ఫోనేదో వస్తే వెళ్ళారు.

డాక్ట : అయితే-మాత్రం. మిమ్మల్నిలా వదిలి వెళ్ళడం ఏం బాగు? నేను వెళ్ళవలసి వచ్చినందుకే అనుకున్నాను.

వాసు: అదేమిటండీ. ఈ మాత్రానికి మీరలా అనాలా? పర్వాలేదు.

డాక్ట : అన్నట్టు-ఇప్పుడు నన్ను కలిసిన వారంతా మీ నాటకాన్ని గురించి చెప్పడమే సరిపోయింది.

రాధ : థ్యాంక్స్.

డాక్ట : థ్యాంక్స్ అంటున్నారు. బాగుందని అన్నారను కుంటున్నా రేమిటి?

వాసు: కాదనుకోండి. కనీసం ఏదో ఒక అభిప్రాయాన్ని చెప్పినందుకు.

డాక్ట : అఁహాఁ. నటులేకాదు - తెలివైనవారు కూడా నన్నమాట అందరి అభిప్రాయాలు చెబితే దిష్టి కొడుతుంది బ్రదర్.

వాసు. ఏదో మీ పెద్దల అభిమానం.

డాక్ట : అదేమిటి! ఇందులో పెద్దరికమేమిటి? ఎవరి వృత్తి వారిది. ఎవరి పెద్దరికం వారిది; ఎవరి ప్రతిభ వారిది. దానికి ఒకరి అభిమానా లక్కర్లేదు. అసలు-మీ ఇద్దరి కాంబినేషన్ కుదిరి నందుకు చెప్పాలి. అమ్మాయి చిన్నదైనా అద్భుతంగా చేసింది.

రాధ : అదంతా మీ వాత్సల్యం.

డాక్ట : ఆ వినయమే వద్దంటాను.

వాసు: ఆమె నాటకాల్లోకి రావడం ఎంత కష్టమైందనుకున్నారు.

డాక్ట : ఏం?

వాసు: ఆమె కెంత అభిరుచి వుందో, తండ్రికంత అయిష్టం. అయినా-ఒప్పుకున్నారు. ఎలాగో సున్నితంగా బండిని లాక్కొస్తున్నాం.

డాక్ట : క్షమించు బ్రదర్. ఆడవాళ్ళ అభిరుచులను అడవి కాచిన వెన్నెల చేదామనుకునే వాళ్ళను చూస్తే నాకు ఉప్పు పాతర వేయ బుద్ధవుతుంది.

రాధ : అది మగవాళ్ల తప్పేకాదు లెండి ఆడవాళ్ళది కూడా వుంది. చాలామంది చదువుకున్న ఆడవాళ్ళే ఒప్పుకోరు.

డాక్ట : దానికో రహస్యం వుంది తల్లీ. నాటకాల్లో వేయడాన్ని—ముఖ్యంగా ఆడవాళ్ళు వేయడాన్ని ఒక భయంకరమైన పనిగా, అపవిత్రమైన పనిగా చిత్రించారు—అదీ మన ఆంధ్రులే. అంతవర కొప్పుకోవాలి.

వాసు: చూడబోతే ఈ విషయంలో మీరేదో రిసెర్చిచేసినట్టున్నారు?

డాక్ట : ఆ ప్రయత్నాలన్నీచేసే అలిసిపొయ్యాను బ్రదర్.

రాధ : మీ రిసెర్చి ఫలితాలు చెప్పారుకారు.

డాక్ట : ఆఁ. ఫలితాలకేముంది?... నాటకాల్లో వేషాలు వేస్తే ఆడ వాళ్ళు చెడిపోతారనేగా వల్లమాలిన ప్రచారం?

వాసు: అనేకదూ అనుకోడం.

డాక్ట : నాకు తెలియకడుగుతాను-ఈ చెడిపోవడమనేది ఒక్క ఆడదాని మొహాన్నే రాసుందా బ్రదర్? మగాడి మొహాన లేదంటావూ?

రాధ : ఆడవాళ్ళ పరిస్థితులు వేరుకదండీ?

డాక్ట : అది కొంతవరకొప్పుకుంటానమ్మా. కొన్ని సమాజాలు కూడా అపసవ్య ధోరణిలో నడుస్తున్నాయనేదికూడా నేను కాదనను. అలాంటి సమాజాల్లోకి ఆత్మనిగ్రహంలేని ఆడవాళ్లు ప్రవేశించి అగాధంలో పడిపోతారనేది కూడా సత్యమే.

రాధ : అవునుమరి. ఈ స్థితిలో ఒంటరిగా ఏ ఆడది రంగస్థల వేదిక నెక్కుతుందంటారు?

డాక్ట : చీల్చాలి తల్లీ. ఈ అనారోగ్య వాతావరణాన్ని చీల్చాలి. సావం సంగల స్త్రీలు రంగంలోకి దిగి తప్పుదారిన వెళ్ళే సమాజాల ధోరణిని మార్చాలి.

వాసు: అసలీ నాటక రంగమే తప్పుడు దనిగదూ చాలామంది స్త్రీల భావన?

డాక్ట : అలాగని—పైకి తప్పని ఘోషపెట్టే ఆడవాళ్ళలో చాలామం దికి నాటక రంగమ్మీదికి రావాలని లేదంటారా?

వాసు: అలాంటప్పుడు తూలనాడడమూ, వెక్కిరించడమూ ఎందుకూ?

డాక్ట : అక్కడే బ్రదర్ ఉన్న రహస్యం. 'ఎబ్బే నాటకాలు' అనే ఆడ వాళ్లు ఎంతోమంది—నాటకాలను, సినిమాలను విపరీతంగా చూస్తారనీ, ఆ పత్రికలను వదిలిపెట్టరనీ బహుశా మీరు గమ నించే వుంటారు. ఎందుకలా చేస్తున్నారని మీ ఉద్దేశ్యం?

రాధ : ఏదో వాటి బాగోగులు తెలుసుకోడానికీ, కాలక్షేపానికి కావచ్చు.

డాక్ట : నేనది నమ్మను. మనంకూడా అంతటి తారలం కాకపోయ్యామే అనే చెప్పరాని దిగులుతో ఆ పని చేస్తుంటారు. పైకి మాత్రం మనసులోది పట్టలేక-'ఛీ ఛీ! వాళ్ళంతా అపవిత్రులు'అని వెర్రి ప్రచారం చేస్తుంటారు. నిజంచెబితే కర్రుచ్చుకుంటారుగాని - చెడిపొయ్యేవాళ్ళకు ఒక్క నాటకరంగమే కావల్సివచ్చిందా? ఆడ, మగ కలిసి చదివే కాలేజీలు, పది సంసారాలు కలిసి కాపురాలుచేసే అద్దెకొంపలు, ఉద్యోగాలుచేసే ఆఫీసులు, నటించే సినిమాలు, ఎగిరే నృత్యశాలలు, పాడే గానా బజానా కార్ఖానాలు-ఇలాంటివి లక్షలున్నాయి. ఆ మాటకొస్తే అసలు ఆడ మగ కలిసి పుట్టిన ఈ లోకమే చెడిపోవడమని అనుమానించడానికి మొదటి మెట్టంటాను. దాని కెక్కడికీ అంతు? మనం-ఎవరికి వారం మోసం చేసుకుంటూ కులకడంలో వున్న ఆనందం మరోవిధంగా లేదనుకుంటాను. పోనివ్వండి-ఇదంతా మీకు నచ్చకపోవచ్చు. అనవసరం. నా సిన్సియర్ అభిప్రాయమేమిటంటే-మీరంతా చక్కగా చేశారు. ఇవేళ ఇంతకన్నా బాగా చేస్తారనుకుంటున్నాను.

రాధ : అదంతా మీ ఆశీర్వాదం.

డాక్ట : ఆఁహాఁ. ఇద్దరిద్దరేనే. అతి వినయం....

వాసు: మరేమనమంటారు చెప్పండి?

డాక్ట : అలాగే చేస్తామంటే తప్పొచ్చిందా?

వాసు: బాగుంది. ప్రయత్నిస్తాం.

డాక్ట : సర్దాగా అన్నాను—కోప్పడకేం. మధ్య మధ్య నేననుకుంటూనే వుంటాను—అనవసరంగా వాగేస్తానని. ఇలా కూర్చొబెడితే

ఎంతైనా వాగుతాను. మరి-ఏమమ్మా. ఆ పాట మరోమారు వినిపిస్తావా? లేదా? ఎప్పటికైనా గొప్ప గాయకుణ్ణి కాక పోతానా అనే వెధవ ఆశతో పియానో (ఏ వాయిద్యం వీలుంటే ఆవాయ్యిదంపేరు చెప్పవచ్చు) కూడా కొన్నాను. పైనవుంది. చూశావుగా? కాస్త పాడితే వింటాను.

రాధ : రిహార్సల్సు ఉన్నాయి. వెడదామనుకుంటున్నామండీ.

డాక్ట : అలాగే వెడుదురుగానమ్మా. ఒకమారు వినిపించి వెళ్ళ కూడదూ?...ఏం—గొంతు పెకలదా? అను—ఏదో ఒకటి చాలమందికి ఈ జబ్బు ఉన్నదేగా?

రాధ : డాక్టరుగారిదగ్గర ఆ జబ్బులు పనిచేయవుగా? (లేచి-మేడమీది కెళ్ళి పాట పాడుతూ, వాయిద్యాన్ని కలుపుతుంది. పాట అయిపోయేదాకా వాసు, డాక్టరు కొంతసేపు సంభాషణ జరుపుతారు. అంతగా ఉన్న సంభాషణ చాలనప్పుడు మధ్య మధ్య పత్రిక చదవడం, సిగరెట్లు త్రాగడం ఇలాంటివి జర పొచ్చు. అవసరమైన సంభాషణ జరిగేటప్పుడు—పాట ఆసంభా షణను మింగెయ్యకుండామాత్రం జాగ్రత్తపడాలి)

పాట

నాకు నేనే సాటి
ఇలలో
నాకు నేనే పోటీ ॥ఇలలో॥

కళకు రూపంబిచ్చి
కళ నుద్ధరించాను
రంగస్థలముపైన
మెరిశాను విరిశాను ॥నాకు॥

బ్రతికినన్నాళ్ళు
బంగారులా బ్రతికి
పాము కుబుసంలాగ
దాన్ని వదిలేశాను ॥నాకు॥

కళకు నీళ్ళను వదలి
మనసు కళ్ళెములాగి
జీవిత రథాన్నొక్క
కొత్తదారిన నడిపి
ఆత్మవంచనయని
అందరూ పిలిచేటి
సామంజసత్వాన్ని
అలవరచుకొన్నాను
నాకు నేనే సాటి
ఇలలో
నాకు నేనే పోటీ ॥ఇలలో॥

(పై పాట జరుగుతున్నంతసేపు వాసు, డాక్టర్ల సంభాషణ)

డాక్ట : ఈ నాటకం కాక ఇంకా ఏమైనా ఉన్నాయా బ్రదర్?
వాసు. ఇక్క డింకేమీ లేవండీ.
డాక్ట : అసలు-మీ రెన్ని నాటకాలు ప్రాక్టీస్ చేశారేమిటి?
వాసు: నాలుగు చేశాం.
డాక్ట : మిగతా రెండింటినికూడా ప్రదర్శించకూడదూ?
వాసు: తమ అభిమానముంటే కాదంటామా?
డాక్ట : అలాగైతే తప్పకుండా ఏర్పాటుచేయిస్తా బ్రదర్.
వాసు: థ్యాంక్స్.

డాక్ట : నాకదేమిటో-పాటలన్నా, నాటకాలన్నా వల్లమాలిన పిచ్చి.

వాసు: దాని కేమిటిలెండి. కాస్తోకూస్తో ఆ పిచ్చి అందరికీ వుండేదే. ఆ లెక్కన—నే నెవరికి చెప్పుకోను?

డాక్ట : మీరంటే ఎలాగూ రంగంలో వుండనే వున్నారు.

వాసు: మీరు మాత్రం ఎందుకుండకూడదూ...అన్నట్టు-పాట వింటు న్నారా?

డాక్ట : బాగుంది. ఒక చెవి అటు పారేసే వుంచాను బ్రదర్. అఁ. పాటలంటే జ్ఞాపకమొచ్చింది. మా దేవికూడా మీతోపాటు నాటకాలు వేసేదటగా?

వాసు: అవును. కాలేజీలో వేసేవారు. వారికప్పుడు ఎంతో అభి లాష వుండేది. ఇప్పు డది లేనట్టుంది.

డాక్ట : దేవి మనస్సులో ఏముందో చెప్పడం కష్టంలే బ్రదర్.

వాసు: ఒక్క పూటలో మీ రెంత కలుపుగోలుగా మాట్లాడుతారు!

డాక్ట : ఏం? కొంపదీసి చెప్పరాని విషయమేమైనా చెప్పానా ఏమిటి?

వాసు: అదేంలేదులెండి.

(రాధ వచ్చేస్తుంది)

డాక్ట : ఏమిటి—పాట అయిపోయిందీ?

రాధ : మీరిలా మాట్లాడుతూ కూచుంటే ఎన్ని పాటలన్నా అయి పోతాయి. (వాసుతో) మనమిక బసకు వెడదామంటారా?

డాక్ట : రిహార్సల్సు కాగానే వస్తారుగా?

వాసు: ఇక అవకాశముండదు. బహుశా—నాటక మయ్యాకనే మళ్ళీ కలుసుకుంటాం. కాకపోతే రాధగారు ఈ లోగా వీలుంటే వస్తారు. అన్నట్టు—నాటకాని కొస్తున్నారుగా?

డాక్ట : బాగుంది. వద్దా ఏమిటి?

రాధ : భలే డాక్టర్‌గారు. మీతో ఎలా మాట్లాడాలన్నా చిక్కే.

వాసు: మంచిది - వెళ్ళొస్తాం. (నమస్కారాలయ్యాక వెడతారు. డాక్టర్ పాట గొణుక్కుంటూ మేడ ఎక్కుతాడు. అదే పాటను వాయిస్తుండగా గబగబా సరళ వస్తుంది. పాట విని పిస్తుంది. చిరాకుపడ్తుంది. చేతిసంచి సోఫాలోకి విసిరేసి ముఖం చిట్లించుకొని) ఎవరది? డాక్టర్ !

డాక్ట : (మేడమీంచు బాల్కనీదగ్గరకొచ్చి) ఏమిటి దేవీ?

సరళ : దేవీ, దేవీ. ప్లీజ్, కాస్త ఆ పాట నాపండి.

డాక్ట : (క్రిందికొస్తూ) ఇంకా మొదలన్నా పెట్టలేదు దేవీ.

సరళ : అందుకే ఆపండి.

డాక్ట : ఎందుకంత చిరాకు?

సరళ : తెలియదు.

డాక్ట : దేవీ ! నే నెంతోమంది పొట్టలుచీల్చి రోగాలు కనుక్కోగలిగా గాని......

సరళ : ఆపండి. ఈ వేళ కిది ఎన్నోసారి?...వారిద్దరూ ఎటు వెళ్ళారు?

డాక్ట : రిహోర్సల్సు వున్నాయని వెళ్ళారు.

సరళ : రిహోర్సల్సా? నాతో వుంటామనే చెప్పారే?

డాక్ట : తర్వాత కలుస్తామన్నారు.

సరళ : తర్వాతెప్పుడు కలుస్తారింకా. హుబ్బ. (సోఫాలో కుప్పగా కూలుతుంది. మళ్ళీ డాక్టర్ పాట గొణుక్కుంటూ పైకివెళ్ళి వాయిస్తాడు. సరళ-"డాక్టర్ ! డాక్టర్ ! ప్లీజ్-కాస్త ఆపండి" అంటూ మెట్లెక్కుతుండగా తెర).

# క్రీనీడలు

## రెండవ రంగం

### ట్రావెలర్స్ బంగళాలో హాలు

[ప్రయాణీకుల సౌకర్యార్థం ఉంచబడే సామాన్లు వీలున్నన్ని ఉంచవచ్చు. వాసు బృందంవారు అక్కడే బసచేశారు గనుక-నాటకానికి సంబంధించిన పరికరాలు కూడా కొన్ని వుంటే బాగుంటుంది. రాధ-ఆ రాత్రి జరుగనున్న నాటకంలోని పోర్షన్ చదువుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నది. ఇంతలో కాస్త చిరాగ్గా సీతాపతి వస్తాడు]

సీతా : ఏమిటి చదువు తున్నావు?

రాధ : పోర్షను.

సీతా : పోర్షన్లూ, గీర్షన్లూ కట్టిపెట్టు.

రాధ : అదేమిటి నాన్నా!

సీతా : ఏమీలేదు. మనం ఇంటికి వెళ్ళుతున్నాం.

రాధ : (అమాయకంగా) ఇవేళ నాటకం ఆగిపోయిందా?

సీతా : అది ఆగనీ, ఆగకపోనీ; మనకు సంబంధం లేదు. నువ్వింక నాటకాల్లో వేషాలు వేయడం లేదు.

రాధ : అదేమిటి నాన్నా-ఒక్కసారే అంతటి నిర్ణయాని కొచ్చారు?

సీతా : అదంతా ఇప్పుడనవసరం. నేనేనాడో చెప్పాను - ఈ రంగం చాలా చెడ్డదని. అయినా - నీ బలవంతాన ఇంత దూరం వచ్చాను. ఇప్పుడు మాత్రం స్పష్టంగా అర్థం చేసుకున్నాను.

రాధ : ఇంతలో కొత్తగా ఏం జరిగిందని?

సీతా : ఏం జరగాలి? నువ్విలా తిరగడంవల్ల లోకం ఏమనుకుంటున్నదో తెలుసా? నా కెంత తలవంపులుగా వుందో ఆలోచించావా?

రాధ : అంత దాచిపెట్టి మాట్లాడకు నాన్నా. ఉన్న సంగతేమిటో స్పష్టంగా చెప్పకూడదూ? ఎవరు? ఏమన్నారు?

సీతా : ఎవరో అంటే నేనేమీ నమ్మను. మీరు రాత్రంతా మకాం చేసిన ఇంటి యజమానురాలు సరళగారే అన్నారు.

రాధ : ఏమన్నారు?

సీతా : పరువుగల ఆడవాళ్ళు ఈ రంగంలో చేరడమంత బుద్ధి తక్కువ మరోటి లేదన్నారు.

రాధ : అలా చెప్పండి. ఒకప్పుడు వారూ నాటకాల్లో వేశారు.

సీతా : వేశారు కనుకనే ఆ నిర్ణయాని కొచ్చారు; అందులోనూ వాసుగారి పక్కన వేశారు కనుకనే అంత తొందరగా నిర్ణయించుకున్నారు.

రాధ : ఇందులో ఏదో గారడీ వుంది నాన్నా. లేకుంటే వారలా అనరు.

సీతా : అవును. నీకు ఇష్టం కానప్పుడు అంత గారడీగానే వుంటుంది.

రాధ : అది కాదు నాన్నా. వారు చెప్పేదాంట్లో నిజం లేదు.

సీతా : రాధా! నీకు ఆమెను విమర్శించే తాహతు లేదు. ఆమె నీకన్నా, వాసుగారికన్నా కూడా ఎక్కువ చదువుకుంది. నీకూ, నాకూ లేని ప్రపంచ జ్ఞానం ఆమెకుంది. అనవసరంగా ఆమెననకు. ఎలాంటి ప్రమాదాలూ జరక్కముందే ఆమె నాకు దారి చూపింది. కనుక—ఇక మాట్లాడడం అనవసరం.

రాధ : అయితేమాత్రం-ఇంత హఠాత్తుగా మానేయమనడం ఏంబాగు?

సీతా : ఊc. బాగోగులు ఎంచేదాకా నీ అంతస్తు పెరిగిందన్నమాట?

రాధ : అదికాదు నాన్నా. తీరా ఇవేళ నాటకం వుంచుకొని-అర్థం లేకుండా హఠాత్తుగా ఇలా మానేసి రమ్మనడం మర్యాదగా వుంటుందా?

సీతా : అందులో వేయడం మర్యాదకనుకనా-మా నేయడంఅమర్యాద? ఆ సాధక బాధకాలన్నీ మన కనవసరం. ఏమైనాసరే—ఇవేళ నువ్వు నాటకంలో వేసే వీల్లేదు. అంతే. అవసరమైతే అతనికి చెప్పే వచ్చెయ్.

రాధ : ఏమని చెప్పను? ఎలా చెప్పను నాన్నా?

సీతా : చెప్పలేకపోతే-చెప్పకుండానే వచ్చెయ్. వెంటనే సిద్ధమైవుండు. నే నిప్పుడే బజారుకెళ్ళివస్తాను.

రాధ : నాన్నా ! అంత సానుభూతి లేకుండా మాట్లాడకు.

సీతా : చాలు. ఇప్పటికి చూపవలసిన సానుభూతంతా చూపాను. ఇక అనవసరం. ఆ ధ్యాస కట్టిపెట్టు. నాతోపాటు ఇంటికి కదిలితేనే నాన్న వున్నాడనుకో. లేకుంటే లేదు. ఒకటే మాట— ఆలోచించుకో. (వెళ్ళిపోతాడు)

రాధ : వెళ్ళకు నాన్నా—వెళ్ళకు... నన్ను కాస్త ఆలోచించుకోనీ నాన్నా—ఆలోచించుకోనీ... ఏమిటీ పరీక్ష?... ఎందుకిలా జరిగింది?

(రాధ-ఏమీ తోచక అటూ ఇటూ పచారు చేస్తుంటుంది. కొంతసేపటికి వాసు వస్తాడు. అతను వచ్చీ రావడంతోటే తాము వేసే నాటకంలోని ఒక ఘట్టం 'రిహార్సలు'గా ఇలా అందుకుంటాడు),

వాసు: శశీ! ఎంతసేపు కొట్టినా తలుపెందుకు తియ్యవ్?

రాధ : (క్షణం నిర్ఘాంతపోయి-చప్పున జ్ఞాపకమొచ్చినట్టు) తీసేవుంది మధూ.

వాసు: తీసేవుంటే ఎందుకు కొడతాను?

రాధ : ఏమో. ఆ విషయం నాకెలా తెలుస్తుంది?

వాసు: అవును. ఈ ఇంట్లో ఎవరికీ ఏవిషయమూ తెలియదు. తెలియనట్టు నటిస్తారు. కాని-శశీ! రహస్యం ఎన్నాళ్లో దాగదు. ఎన్నడో ఒకనాడు బయటపడితీరుతుంది.

రాధ : ఏమిటామాట మధూ. నేను నిన్ను 2, 3 నెలలనుంచి ఇలా చూస్తున్నాను. మనసులో ఏదో పెట్టుకొని పైకిమాత్రం దెప్పిపొడుస్తుంటావు.

వాసు: అవును. మనసును లోలోపల పొడిచేవాళ్ళది ఏదోషమూలేదు. పైకేమైనా అంటేనే దోషం. పైగా అనకముందే ఏదో అన్నారని గోలపెట్టేస్తారు.

రాధ : ఇలా ఎందుకంటున్నావో కాస్త చెప్పకూడదు మధూ?

వాసు: ఆ రోజూ వస్తుంది శశీ. ఆ రోజూ వస్తుంది. పొగ రాజిరాజి ఒక్కనాడే మంట భగ్గున మండుతుంది. ఆ మంటలో అందరి కల్మషాలూ భస్మమైపోతాయి. దాని కెన్నాళ్ళోపట్టదు.

రాధ : అంత భయంకరమైన పరిస్థితి వుందని తెల్సినప్పుడు ముందే చెప్పకూడదూ?

వాసు: ముందే ఎవరు చెప్పి చేస్తారు? అంతా మోసం. పైకి మాత్రం ఇష్టంగావున్నట్టే నటిస్తారు. అలా నటించనినాడు లోకం ఏమైనా అంటుందని భయం. నాకీ ప్రవర్తన నచ్చదు శశీ. మనసులో ఏదైనా వుంటే మొహమెదుటనే చెబితే సంతోషిస్తాను.

అంతేకాని—లోపల మాత్రం విషాన్ని పెట్టుకొని పైకి తేనె పలుకులు పలకడం నాకెంత మాత్రం గిట్టదు.

రాధ : రామ రామ. ఎవరి మనస్సులో ఏముందో తెలిసేదెలా మధూ? అనవసరంగా లోపలేవో లేనిపోని అనుమానాలు పెట్టుకొని— ఇతరుల మనస్సుల్లో ఏదో విషముందని భ్రమపడితే ఎవరేం చేస్తారు? ఈ 2, 3 నెల్లబట్టి నా మనస్సును ఎంతగా రాచిరంపాన పెడుతున్నావో నీవు ఒక్క క్షణమైనా ఆలోచించావా? లేదు. ఎప్పుడో అర్ధరాత్రికి ఇంటికి వస్తావు. అంత రాత్రిదాకా నేనెలా ఒంటరిగా బిక్కు బిక్కుమంటూ కూచోవాలో నీకెన్నడైనా తట్టిందా?...లేదు. పైగా — వచ్చిన వాడివి అప్పుడైనా సంతోషంగా మాట్లాడావా? అదీలేదు. ఎప్పుడూ ముభావంగా, ఏమీ పట్టనట్టు మొహం ముడుచుకొని వుంటుంటావు. ఆ నిశ్శబ్దంలో ఏ మాటంటే ఏం ప్రమాదమో నని నేనెంత కుమిలి పోతున్నానో నీవుఎన్నడూ ఆలోచించవు; మధూ—ఎన్నడూ ఆలోచించవు.

వాసు: అవును. ఎవరు, ఎవర్ని రాచిరంపాన పెడుతున్నదీ తెలుస్తూనే వుంది. నేనెప్పుడు ఆఫీసు కెడతానా అని కాచుకు కూచునే నీ ప్రవర్తన, ఇంత పెందలాడే వచ్చాడని చూపే చికాకు నేను ఎప్పుడూ నీ మొహాన చూస్తూనే వున్నాను. అందుకే సాధ్యమైనంత వరకు నీ కోర్కెలకు భంగం లేకుండా వుండడానికే అక్కడక్కడా తిరిగి ఎప్పుడో, ఏ అర్ధరాత్రో కొంపకు చేరు కుంటున్నాను. నేను వచ్చినప్పటినుంచీ ఎప్పుడు నిద్రపోతానా అని ఎదురుచూస్తూ కూచుంటావు. ఇదంతా ఎవరి ప్రవర్తనంటావు? అవును. నీదని వొప్పుకోలేవు. నాదేననేస్తావు. నీకోసం, నీ సుఖంకోసం, నీ విలాసాలకోసం పొద్దస్తమానం కష్టపడే

ఈ మనిషి పడే శ్రమ నీకు ఏమాత్రం జ్ఞాపకంరాదు శశీ. ఏ మాత్రం జ్ఞాపకంరాదు. నీ దృష్టిలో భర్తన్నవాడు ఒకబానిస్త, సేవకుడు, భార్యకోసం వొళ్లు విరుచుకొని పని చేయాల్సిన భృత్యుడు, భార్య చెప్పిన కూరగాయలు తేవాలి; భార్య అడిగిన నగలు కొనాలి; భార్య కిష్టమైన సినిమాలు చూపాలి. అయినా-కృతజ్ఞత వుండదు. ఇదంతా వాడుగతిలేక చేస్తున్నట్టు భావిస్తావు.

రాధ : (గట్టిగా) ఆపు మధూ. ఆపు. అర్థంపర్థంలేకుండా ఏమిటా మాట? ఎన్నడైనా నీవిలా మాట్లాడ్తావని కలగన్నానా? నేనే పని చెప్పినా అది మనిద్దరి అవసరంకోసమని చెప్పానేగాని— నా సుఖం, నా విలాసాలకోసమే చెప్పానా? మామూలు విషయాలకు నీవింత పెడర్థాలిస్తావని ఎన్నడూ వూహించలేక పోయాను. అనవసరంగా అపార్థాలు కల్పిస్తున్నావు. ఆమాటకొస్తే-భర్త అనబడే ఒక్క పరాయి మగాడికోసం పుట్టి పెరిగిన ఇంటినీ, పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులనూ, అమితమైన ప్రేమను కురిపించే తోబుట్టువులనూ, అతి మక్కువపర్చడ్డ ప్రదేశాలనూ పూర్తిగా వదిలేసివచ్చే ఆడదానిసంగతి నువ్వెన్నడైనా ఆలోచించావా మధూ? ఆ విషయం నీవాలోచించవు. భార్య అన్నది అలా రావాలని నీ ఉద్దేశ్యం. ఏదో భర్త సంపాదనను కరగతినటానికి వస్తుందని నీవిశ్వాసం. అంతేనా?

వాసు: అలా రాకపోతే-వెళ్లు. ఎవరు రమ్మన్నారు నిన్ను? మీ ఇంటికే వచ్చి ఇల్లరికంవుండే అల్లుణ్ణి తెచ్చుకుంటే పొయ్యేది మీవాళ్ళకు. అంత ఇష్టంలేనిదానవు-ముందుగా ఏదో పెద్ద ఇష్టమున్నట్టు నటించడ మెందుకూ? వివాహమాడి మధ్యలో ఇలా ప్రవర్తించడ మెందుకూ? అంతగా మనసు వేరేచోట

వుంటే హాయిగా వెళ్ళిపోతేనే అందరికీ, అన్ని విధాలా బాగుంటుంది.

రాధ : అబ్బబ్బ ! మధూ. మంచీ చెడ్డా ఆలోచించకుండా నోటికొచ్చినట్టు మాట్లాడేస్తావు. దానర్థం ఏమిటనిగానీ, దానివల్ల ఎవరెలా బాధపడ్తారనిగానీ ఆలోచించవు. నీతో చావుగా వుంది.

వాసు: అవునుగదూ. నిజమే. నేను చచ్చిపోతే నీకు హాయిగా వుంటుంది. అందుకే ఎప్పుడో చచ్చిపోతాను; కుమిలి కుమిలి చచ్చిపోతాను; ఎవరికీ తెలియకుండా చచ్చిపోతాను.

రాధ : ఊఁ అంటే అలా అంటావు. మనసులో ఏదో పెట్టుకొని నన్నింతగా ఎందుకు వేధిస్తావు చెప్పు? చచ్చిపోతా, చచ్చిపోతానంటావు. నాకు-నువ్వు తప్ప మరెవరున్నారు మధూ చెప్పు?

వాసు: అందుకేనా-ఈ 2, 3 నెల్లనుంచి ఇలా ప్రవర్తిస్తున్నావు?

రాధ : అదేమిటో చెప్పకూడదా మధూ. అది తెలిస్తే నా మనస్సు, నీ మనస్సు ఎంత తేటగా వుంటాయి?

వాసు: తేటగా వుంటాయా--శశీ. తేటగా వుంటాయా? అబ్బ. నీకెంత తేలిగ్గావుంది ఆ మాట?

రాధ : ఏమిటా మాట మధూ. చెప్పు. చెప్పితీరాలి. లేకుంటే నన్ను చంపేసెయ్. అంతే.

వాసు: నిన్నెందుకు చంపుతాను శశీ. నా అంతట నేనేచచ్చిపోతాను. ఆ మాటేమిటో చెప్పి చచ్చిపోతాను. 3 నెల్ల కిందట దసరా రోజున ఏమన్నావో గుర్తుందా?

రాధ : ఏమన్నాను మధూ? నిజంగా జ్ఞాపకంరావడంలేదు. అవును. అప్పటినుంచే నువ్విలా తయారయ్యావు.

వాసు: నేనిలా తయారుకావలనేగా అన్నావు?

రాధ : అదే-ఏమిటో చెప్పు మధూ చంపక.

వాసు: ఇక-నిన్నుగురించి అంతగా ఆలోచించవద్దన్నావు. అవునా? బహుశా-అనలేదంటావు?

రాధ : (పకపకా నవ్వి) హబ్బ-అదా నీ సందేహం మధూ. అందుకా నువ్విలా తయారయ్యావు. అవును మధూ. అలా అన్నానంటే అనుమరి. లేకుంటే-నేనంటే నీకంత వల్లమాలిన ఇష్టమైతేమాత్రం ఏం బాగు మధూ? ఎవరికైనా, దేనిమీదనైనా అవసరాన్ని మించిన ఇష్టముంటే మంచిదా మధూ? నువ్వు ఏ పనీ లేకుండా అస్తమానం నా మొహం, నా చేష్టలు, నన్ను గురించిన కలలు-ఇవే నీకు అన్నం, నీళ్ళు, మనసైపోతే ఎంత ఇబ్బందో ఆలోచించు. ఒకవేళ నీ కళ్ళముందే నేను రాలిపోతే ఎంత ప్రమాదమో ఆలోచించు మధూ. నేను చనిపోతే నీవింతగా కట్టుకొన్న ఆశా సౌధాలన్నీ కూలి ముక్కలైపోతే నీ మనస్సు భరించిస్తుందా చెప్పు మధూ... నేను చనిపోతే నీ.వేమవుతావు మధూ? (తల నిమురుతూ అంటే బాగు).

వాసు: (హఠాత్తుగా కన్నీరు పెట్టుకునేదాకావస్తుంది) ఇక చెప్పకు శశీ...ఇక ఏమీ చెప్పకు. (ఆవిడ కళ్ళు తన కళ్ళలో కలవడానికి ఆమె తలను పట్టుకొని తిప్పి అంటే మంచిది)...నువ్వు చచ్చిపోతావా? అంత మాటనకు. బతుకుతానను శశీ. బతుకుతానను.

రాధ : ఎంత పిచ్చివాడివి మధూ నువ్వు. అందుకే ఇలా తయారయ్యావు. నేను లేకుంటే నువ్వేమవుతావు బాబూ?

వాసు: బతుకుతానను శశీ. బతుకుతానను.

రాధ : బతుకుతాను మధూ. నీకోసం బతుకుతాను. పిచ్చితండ్రివి. ఎలా పుట్టావు మధూ నువ్వు? మరి—ఎప్పుడూ ఇలా అపోహ పడనని వొట్టెయ్యి. (చేయి అందిస్తుంది).

వాసు: లేదు శశీ. నే నెప్పుడూ ఇలా అపోహపడను. నా జన్మలో అపోహపడను శశీ. ఇదిగో ఒట్టేసి చెబుతున్నాను. (చేతిలో చెయ్యి వేసి ఒట్టేస్తుండగా అంతకుముందొచ్చిన సరళ హేళనగా చప్పట్లు కొడుతుంది. వాసు, రాధలు మామూలు స్థితిలో కొస్తారు).

సరళ : నేను లోపలికి రావచ్చా?

వాసు: తప్పకుండా. మీ కెప్పుడూ స్వాగతమే. ఇక్కడ రహస్యా లేమున్నాయి?

సరళ : ఏమో—ఒకరి కొకరు బాసలు చేసుకుంటూవుంటే—

వాసు: బాగుంది. ఇది నాటకంలోని పోర్షన్ మాత్రమే. ఎప్పుడంటే అప్పుడు రాధగారు మూడ్స్‌లోకి రాగలరా, లేరా అని హఠాత్తుగా ప్రారంభించాను.

సరళ : మొత్తంమీద రప్పించారు...నాటకంలోని భాగమే ఇలా వున్నప్పుడు—నిజ జీవితం ఇంతకన్నా చిత్రంగా వుండవచ్చు నంటారా?

వాసు: అదంతా మన ఊహాలనుబట్టి ఆధారపడివుంటుందనుకొండి... ఎప్పు డొచ్చారు మీరు?

సరళ : సరిగ్గా సమయానికొచ్చాను.

రాధ : సమయమంటే?

వాసు: సరళగారు చమత్కారంకూడా నేర్చారు. ఆఁ-ఫోనివ్వండి. ఏమిటిలావచ్చారు?

సరళ : అభ్యంతర మేమీలేదుగా—ఇలా చెప్పకుండా రావడంవల్ల.

రాధ : ఎందుకూ అభ్యంతరం?

సరళ : మీ నాటకాన్ని-అయాం సారీ-దాన్నేమనాలి? ఆఁ-మీ నటనను మధ్యలో ఆపినందుకు.

వాసు: ఏమిటండీ మరీనూ. ఏదో పనుండి వచ్చి వుంటారు.

సరళ : తప్పకుండా. క్షమాపణలు చెప్పకోడానికి.

రాధ : క్షమాపణలు చెప్పకోడం. ఈ మాత్రానికే !

సరళ : దీనికి కాకుంటే మరోదానికి. ఎందుకో మీరు చెప్పకుండానే వచ్చేశారు?

వాసు: ఇదిగో-రిహార్సల్సు వున్నాయిగదండి. అందుకే వచ్చాం.

సరళ : అబద్ధమెందుకు చెబుతారు? మా ఇంట్లో వుండడం ఇష్టం లేదనండి.

రాధ : బాగుంది. ఎందుకన్నారా మాట?

సరళ : చెప్పకుండా వస్తే ఏమనుకోవాలిమరి? అయినా-రిహార్సల్సుకే రావాలంటే ఇక్కడికి రావాలా? మా ఇంట్లోనే జరుపుకోవచ్చుగా?

వాసు: అదెలా? ట్రూప్ వాళ్ళంతా ఇక్కడున్నారు. అవసరమైన పరికరాలన్నీ ఇక్కడే వున్నాయి. అక్కడ జరుపుకోవాలంటే ఎలాగైనా కష్టమే.

సరళ : కష్టం ఎవరికంటారు? మీకా, మాకా?

రాధ : మీరు చాలా ఇరుకున పెట్టేస్తారే.

వాసు: మొదట్నుంచీ వారి స్వభావమే అంత. అందులోనూ పెద్ద చదువులు చదువుకున్నవారు. మనం వారి ముందు ఏం మాట్లాడగలం?

సరళ : ఆమాటె అనొద్దన్నాను. ఇంతకూ-మీతో కొన్ని విషయాలు మాట్లాడాలన్నాను. జరగనే లేదు.

వాసు: ఎప్పుడైనా సిద్ధమేనన్నానుగా.

సరళ : అన్నారేగాని ఆచరించలేదు. అయినా-మీరిప్పుడు కలిసే స్థితిలో లేరనుకుంటాను.

వాసు: ఎంతమాట ! మీ రెప్పుడు మాట్లాడుదామంటే అప్పుడే.

సరళ : అలాగైతే ఇప్పు డొస్తారా వెడదాం.

వాసు: క్షమించాలి. ఈ రిహార్సల్స్ కాగానే—స్టేజిదగ్గరికెళ్ళి అక్కడి ఏర్పాట్లు చూసి రావాలనుకున్నాను.

సరళ : అదిగో-నేను చెప్పలే-మీకు ఎప్పుడూ ఏదో పని వుంటూనే వుంటుందని.

వాసు: లేదు. ఇప్పుడు వెడుతున్నాను. ఒక గంటలో వచ్చేస్తాను.

సరళ : అయితే—మీరొచ్చేదాకా ఇక్కడ వెయిట్ చెయ్యొచ్చుగా?

వాసు: ఎందుకూ వెయిట్ చెయ్యడం? తప్పకుండా వస్తాను. అయినా వుంటే వుండండి-మీ ఇష్టం.

(వాసు వెడతాడు)

రాధ : ఏమండీ—మీరు ఇదివరకు నాటకాల్లో వేసేవారాండి?

సరళ : ఆఁ నాకు తెలియని స్థితిలో. ఎలాగైనా మీఅంత బాగా నటించలేనులెండి.

రాధ : సరె. ఆ విషయం మీరు చెప్పక్కర్లేదు. నేనువిన్నాననుకొండి.

అయితే-సరళాదేవిగారూ! మీరు వాసుగారితోటే నాటకాలు వేశారేమో...వారిని గురించి మీ అభిప్రాయమేమిటండీ?

సరళ : ఏమిటీ ఒక్కసారే అలా ప్రశ్నించారు! నాకేఅభిప్రాయమూ లేదు. ఏదో వారితో మాట్లాడుదామనుకున్నాను గనుకనా అలా అడిగారు?

రాధ : అదేమిటి? మీ రేం మాట్లాడినా నా కేమిటి అభ్యంతరం? వారితో మీరు నటించారుగదా-వారిని గురించి మీ అభిప్రాయ మేమిటీ అన్నాను.

సరళ : అంటే-వారిని గురించి అంటూరా? వారి నటనను గురించా?

(గబా గబా శీను వచ్చి అందుకుంటాడు)

శీను : ఓహోహో-నా నటనను గురించే ఇంత చర్చ! అప్పుడే ఇంత దూరం పాకిందన్నమాట-నేను ట్రూపులో చేరబోతున్నానని.

సరళ : ఏడిశావ్-సంగతి, సందర్భం లేకుండా ఏమిటూవాగుడు? అస్తమానం నీ నటనే కావల్సివచ్చింది లోకానికి.

శీను : మరెవరి నటనంటావు? వాసు, రాధగార్ల నటనను గురించి నిన్న, మొన్న అనుకోనే అనుకున్నాం. నా నటనను గురించి కాదు. మరి—నీ నటనా?

సరళ : చాలుగాని-ఎందుకూ ఇక్కడి కొచ్చావు?

శీను : పనక్కయ్యా పని. బావయ్య పంపిన పని.

సరళ : ఏం పని?

శీను : వీరు—నిన్న నాటకంలో పాడిన పాట చెబుతామని అలాగే వచ్చేశారట. తీసుకరమ్మన్నాడు బావయ్య.

రాధ : ఏముందండీ పెద్ద ఆ పాటలో నేర్చుకోవలసింది. అయినా-

ఇప్పుడు అక్కయ్యగారితో మాట్లాడుతున్నాగదూ? ఎలా రాను?

సరళ : ఆయ నంతగా పిల్చినప్పుడు మధ్య నే నెవరు? వెళ్ళిరండి.

రాధ : అంతకైతే తర్వాత వెడతాలెండి.

శీను : తర్వాత బావయ్య బయటి కెడతాడట.

రాధ : వీరి నొక్కరిని ఇక్కడ కూచోబెట్టి రావడమెలా?

సరళ : దానికేమిటిలెండి. వెళ్ళిరండి. వాసుగారు వచ్చేదాకా ఉంటాను. అయినా-మీ నాన్నగారున్నారుగా?

రాధ . ఆయనా బయటికెళ్ళారు.

సరళ : అయినా ఫర్వాలేదు. వెళ్ళండి.

శీను : నువ్వుకూడా రారాదూ-తర్వాత మళ్ళీ రావచ్చు.

సరళ : నే నెందుకూ మధ్యలో—వారేవో పాట నేర్చుకుంటుంటే.

రాధ : మీ భావం నా కర్థంకాలేదు.

సరళ : నా భావం ఎవరికీ అర్థంకాదులెండి. వెళ్ళిరండి.

రాధ : సరె—క్షమించండి. వస్తాను.

(రాధ, శీనులు వెడతారు. కొద్దిసేపటికి సీతాపతి వస్తాడు. సరళ మరోవైపు తిరిగి వుంటుంది. సీతాపతి-ఆమెను రాధను కొని)

సీతా : ఏం-ప్రయాణానికి సిద్ధమయ్యావా?...ఓహో—మీరా?

సరళ : నేనే. ఎవర్ని ప్రయాణం కావాలంటున్నారు?

సీతా : క్షమించాలి. మా రాధనుకొని అన్నాను.

సరళ : ఫర్వాలేదు. ఎక్కడికీ ప్రయాణం? హాలుదగ్గఱకా? అప్పుడే!

సీతా : హాలుకు కాదు; మా వూరికి.

సరళ : అదేమిటి-మీరు నిజంగా అంటున్నారా?

సీతా : మీతో పరిహాసమా?

సరళ : ఇవేళ నాటకముందికదండి?

సీతా : ఉండవచ్చు. కాని-మా రాధ వేయదు.

సరళ : ఇదేమిటి-ఒక్క సారే అలాంటి నిర్ణయానికొచ్చారు!

సీతా : ఎప్పటికైనా ఇలాంటి నిర్ణయానికి రాకతప్పదు. ఎప్పటి కప్పుడు ఏదోవిధంగా సరిపెట్టుకోగలిగాను. కాని-మీబోటివా రన్నాక...

సరళ : బాగుంది. నేనేదో నా అనుభవాలు, విన్న విషయాలు చెప్పానుగాని...

సీతా : అవే చాలు. నా కవే మేలుకొలుపు.

సరళ : అనవసరంగా నేనేదో అన్నానని మీరు నాటకం పడకుండా చేస్తున్నారేమో?

సీతా : బాగుంది. మీరేమన్నారని? లోకం అనుకుంటున్న విషయం చెప్పారు. ఇంకా నయం. ఆ మాటయినా ఇంత స్పష్టంగా ఎవరు చెప్తారు చెప్పండి? ఎవరికివారే పైకేదో మొహమాటా నికి మెచ్చుకుంటూ, లోపల పకపకా నవ్వుతారు. మీరు-మా హితాన్ని కోరేవారుగనుక చెప్పారు. దాని కెంతో కృతజ్ఞుణ్ణి.

సరళ : ఈమాత్రానికే కృతజ్ఞతలా! అయినా—ఇవేళ నాటకం పడ కుండా చేయడం-

సీతా : నా నిర్ణయాన్ని మార్చకండి సరళాదేవిగారూ! ఇక రాధ నాటకాల్లో వేయడానికి నా మనస్సేమాత్రం ఒప్పడంలేదు.

సరళ : అదీ నిజమేననుకోండి అక్కడికీ ఈమధ్య వాసుగారి ప్రవర్త నేమైనా మారిందేమో ననుకొన్నాను. కాని—పుత్రెతో

పుట్టింది పుడకలతోగాని పోదన్నట్టు-మధ్యలో ఎలాపోతుంది? నిజంగా ఇప్పుడు మీరు లేరుగాని-ఆ దృశ్యం చూస్తే మీరు వెంటనే అమ్మాయిని తీసుకెళ్ళేవారేమో.

సీతా : ఏం జరిగింది?

సరళ : పేరుకదంతా రిహార్సల్ అనుకోండి. నేనేచూడలేకపొయ్యాను. ఏమోలెండి. నాటకమన్నాక అవ్వన్నీ ఉండక తప్పదు మరి.

సీతా : సరళగారూ! ఇక అవ్వన్నీ చెప్పకండి. ఇంక ఒక్కక్షణమైనా ఊరుకోను. ఇంతకూ వీళ్ళెటు వెళ్ళినట్టు?

సరళ : ఏదో పనుండి వెడుతున్నామన్నారు.

సీతా : మీరొచ్చాకనే! అదేమిటి-మిమ్మల్నిలా ఒక్కర్ని కూచోబెట్టి ఎలా వెళ్ళారు?

సరళ : ఆఁ. నాకిదంతా ఆయనతో అనుభవమేలెండి.

సీతా : ఎంత అన్యాయం. అయితే-నే నిన్నాళ్ళూ ఇలాంటి ప్రవర్తనను గమనించనేలేదన్నమాట. అక్కడికీ నే నప్పుడప్పుడు అనుకుంటూనే వుంటాను.

సరళ : సరె-నే నొస్తామరి.

సీతా : ఎందుకొచ్చినట్టు? ఎందుకు వెడుతున్నట్టు?

సరళ : ఏదో కలుద్దామని వచ్చాననుకోండి. అవకాశం లేనప్పు డేం చేస్తాంగనుక? మళ్ళీ ఎప్పుడైనా కలుస్తాలెండి. వస్తాను.

సీతా : మంచిది. (సరళ వెళ్ళిపోతుంది) హారి దుర్మార్గులు! కాస్త చనువిస్తే ఇష్టమొచ్చినట్లల్లా ఆడ్తారా. చూస్తాను — వీరి ఆట లెలా సాగుతాయో!

(రాధ వస్తుంది)

సీతా : ఎక్కడికే ఇద్దరూ వెళ్ళారు?

రాధ : ఎవరిద్దరు?

సీతా : ఇంకెవరు? ఆ వాసుగాడూ, నువ్వూ.

రాధ : ఏమిటిది నాన్నా-క్షణంక్షణం నీవేదో పిచ్చివాడివై పోతున్నా వేమిటి?

సీతా : రాధా ! నా కళ్ళు మూయడానికి ప్రయత్నించకు. నాకన్ని వివరాలూ తెలిశాయి సరళగారు పూర్తిగా చెప్పారు.

రాధ : ఏరి వారు?

సీతా : మీరిద్దరూ ఎటోకులకడానికివెడితే ఆమె కాచుకొనికూచోవాలా?

రాధ : నాన్నా-ఏమిటా మాట? వాసుగారు, నేను కలిసి వెళ్ళామని ఎవరు చెప్పారు?

సీతా : ఎవరో చెప్పాలా? నాకామాత్రం బుర్ర లేదూ? నేనామాత్రం వూహించలేనూ?

రాధ : నేనూ, వాసుగారూ కాదు కలిసి వెళ్ళింది. నేను డాక్టరుగా రింటి కెళ్ళాను.

సీతా : ఏమిటీ ! సరళగా రిక్కడ వుంటే నీకు వారింట్లో ఏం పని చెప్పు?

రాధ : డాక్టరుగారు పిలిస్తే వెళ్ళాను.

సీతా : ఎందుకు పిలిపించారు? ఏం పనిమీద పిలిపించారు? భార్య ఇక్కడ వుండగా ఆయ నెందుకు ఒంటరిగా పిలిచాడు?

రాధ : నాన్నా ! నీకు పూర్తిగా మతిపోయింది. పిలిచిన ఆయనకులేని తప్పు నాకేనా?

సీతా : అంటే-మీ ఇద్దరికీ లేదన్నమాట?

రాధ : ఏమిటూ వూహించుకోడాలు? నా మాటే వినిపించుకోకుంటే ఇంకేం చెప్పను?

సీతా : ఇంకేమీ చెప్పక్కర్లేదు. నా కంతా అద్దంలో చూసినట్టు అర్థమవుతున్నది.

రాధ : నీకేమీ అర్థంకావడంలేదు. అదంతా నీ భ్రమ.

సీతా : ఊఁ. అంతదూరం వచ్చిందన్నమాట...ఇంటికి కదులుతున్నావా? లేదా?

రాధ : ఇంత అర్థాంతరంగా ఎలా వచ్చేది?

సీతా : నీవు వాణ్ణి వదలలేవన్నమాట?

రాధ : నాన్నా! అర్థం పర్థం లేకుండా మాట్లాడెయ్యకు. ఇవాళ రాత్రి నాటకం వుందని అంత పెద్దెత్తున ప్రచారం జరిగాక నేనెలా వచ్చేది?

సీతా : అంటే—నీకు వాసుగాడే కావాలన్నమాట? తల్లి అక్కర్లేదు, తండ్రి అక్కర్లేదు, పెండ్లక్కర్లేదు.

రాధ : ఇంకా అను నాన్నా—పరువక్కర్లేదు, మర్యాద అక్కర్లేదు. అనవలసినవన్నీ అను.

సీతా : అవును. నీ కవేమీ అక్కర్లేదు. కదులు ముందు.

రాధ : వాసు గారికి తెలుపకుండా ఎలా రాను?

సీతా : తెలుపమని ఇందాకే అన్లే?

రాధ : అవకాశమే లేకపోయింది.

సీతా : అవును. ఎందుకుంటుంది? రాదలుచుకోనప్పుడు ఏ అవకాశమూ వుండదు. అయినా—ఇప్పుడదంతా అనవసరం. ఇక ఒక్క క్షణమైనా ఆగే వీలులేదు. నీకు—తల్లి, తండ్రి, పెళ్ళి, పరువు కావాలంటే వెంటనే నాతో కదులు. లేకుంటే ఏడువు.

[అని చిరాగ్గా ఏవో సర్దుకోడానికి లోపలి కెడతాడు. గబగబా లోపల్నుంచి "తల్లి, తండ్రి, పెళ్ళి, పరువు కావాలంటే వెంటనే నాతో కదులు—లేకుంటే ఏడువు" అనే మాటలు పదేపదే ఊపిరిసలప నంత వేగంగా వినిపిస్తాయి. రాధ—ఉక్కిరి బిక్కిరై పోతుంది. ఏమీ ఆలోచించలేకపోతుంది. చిరాగ్గా అటు ఇటూ తిరుగుతుంది. ఆ మాటలు సమ్మెట పోటుల్లా వినిపిస్తాయి. ఇక తట్టుకోలేక ఒక్కసారే అరుస్తుంది.]

రాధ : నాన్నా — పద నాన్నా — నేనూ వస్తాను. (లోపలికెళ్ళి తిరిగి తండ్రితో సామాన్లవీ తీసుకొని రంగమ్మీదికొస్తుంది...ఆగు తుంది)

సీతా : ఊఁ. ఎందుకాగుతావు?

రాధ : ఒక ఉత్తరమైనా వ్రాసి వస్తా నాన్నా. (లోపలికెళ్ళి కాసే పటికి లేఖతో వస్తుంది. అంతదాకా సీతాపతి ఇంకా కూతురు బయలుదేరనందుకు మధ్యమధ్య పిలుస్తూ అటిటుతిరుగుతాడు. రాధలేఖను రంగం మీద కనిపించే టేబుల్ మీద వుంచి తండ్రితో వెడుతుంది...కాస్సేపటికి వాసు వస్తాడు. అతనికి రాధ వెళ్ళి పోయినట్టు తెలియదు. ఏదో విషయం చెబుదామన్నట్టు పిలు స్తాడు)

వాసు: రాధగారూ! రాధగారూ! [ఎవరూ పలుకరు. అటూ, ఇటూ చూస్తాడు. ఎక్కడా కనబడకపోయే సరికి-దృష్టి టేబుల్ మీద వున్న లేఖమైన పడుతుంది. విప్పి చూస్తాడు. ఆశ్చర్యం, కోపం కనుపరుస్తూ] హాబ్బా! రాక్షసీ — ఎంతపని చేశావే? కొంప ముంచావు సరళా! కొంప ముంచావు.[గబగబా లేఖతో బయటి కెడుతుండగా తెర]

•

# క్రీనీడలు

## మూడవ రంగం

### డాక్టరు ఇల్లు

[సోఫాలో కూర్చొని సరళ ఏదో లేఖ వ్రాస్తుంటుంది. మేడ పైనుంచి 'నాకు నేనే సాటీ' పాట - డాక్టర్ పాడుతూ, వాయిస్తు న్నాడు. సరళకు చిరాకు కలుగుతుంది. కలం ముందుకు సాగదు. లేచి అటూ, ఇటూ తిరుగుతుంది. పాట ఆగేట్టు కనబడదు. పైగా ఎక్కువ స్థాయిలో వచ్చేస్తుంది. 'పాము కుబుసంలాగ' అనే చరణం వరకు వచ్చేసరికి ఇక భరించలేక పోతుంది. గట్టిగా]

సరళ : డాక్టర్! డాక్టర్!

డాక్ట : (పాట నాపి బాల్కనీ దగ్గరికొచ్చి) ఏమిటి దేవీ?

సరళ : దేవీ! దేవీ! ప్లీజ్—కాస్త ఆ పాట నాపండి.

డాక్ట : (దిగి దగ్గరి కొస్తూ) ఆపాగా. అయినా—అది చెవుల్లో ఇంకా రింగు రింగు మంటున్నదా ఏమిటి ఖర్మ?

సరళ : ఖర్మ! ఖర్మ! ఖర్మలాగే వుంది బ్రతుకు.

డాక్ట : దేనిమీద నీకంత కోపం? ఆ పాట మీదనా? నేను పాడడం మీదనా?

సరళ . ఏం చెప్పను? నిజంగా మీకా పాట నచ్చిందా, ఆ పాడినవారు నచ్చారా అంటే ఏం చెప్తారు?

డాక్ట : ఓ అదా విషయం! నిజంగా నాకాపాటే నచ్చింది. అఫ్ కోర్స్. ఆవిడకూడా నచ్చిందనుకో (సరళ మూడ్స్‌ను పరీక్షిస్తూ) ఐ మీన్ ఆవిడ నటన.

సరళ : నిజంగా ఇదంతా నటన కాదుగదా?

డాక్ట : చెప్పాగదూ—నటుణ్ణి కావలసిన వాణ్ణే కాని—ఖర్మకాలి డాక్టర్నయ్యాను. కనుక నటనకు అవకాశమేమీ లేదు. అయినా—దేవిగారు ఎన్నడూలేంది అంతదూరం ఎందు కాలోచించారో?

సరళ : పదేపదే ఒకే పాటను పాడుతుండబట్టి.

డాక్ట : పదేపదే తమరు పడే మథనకు వేరే అర్థాలు తీయవచ్చా ఏమిటి?

సరళ : నా దగ్గర వేరే అర్థాలకేం అవకాశం లేదు.

డాక్ట : నేనన వలసిన మాట నీవన్నావు దేవీ. ఏ విషయాన్నీ నేను మనసులో వుంచుకొని కుళ్లను. నిజంగా నీ వనుకున్నట్టు ఆ ఆఅమ్మాయి మీదేఇష్టముంటే-ఆవిడతోనూ, నీతోనూ స్పష్టంగా చెబుతాను.

సరళ : ఆ విషయాల్లో అంత బహిరంగమన్న మాట?

డాక్ట : అంతరంగంలో కుళ్ళేకంటే బహిరంగంగా సంతోషించడం బాగనేది నా తత్వం. సరే—పోనీగాని—ఆ పాట నిన్నంతగా ఎందుకు వేధిస్తున్నట్టు?

సరళ : రాసేలేఖను సాగనివ్వకుంటే ఏం చేయాలి?

డాక్ట : అంత తీవ్రంగా ఆలోచించి రాసే లేఖ ఏమిటో?

సరళ : అది నా పర్సనల్ విషయం. (తోచక) నిద్రొస్తున్నదన్నారుగా? పడుకోక పొయ్యారూ?

డాక్ట : నిద్ర-ఆ విషయం ఒకరు చెప్పక్కర్లేదు. నాకు నిద్రపట్టనంత దిగులు మనసులో ఎప్పుడూ లేదు.

సరళ : నా మనసులో వుందంటారా?

డాక్ట : ఏమో—ఆ విషయం తెలుసుకోనిస్తేగా. నేను ఎంతో మంది పొట్టలు చీల్చి రోగాలు కనుక్కో గలిగా గాని నీమనసులో ఏముందో తెలుసుకోలేక పొయ్యాను దేవీ...

సరళ : చాల్లెండి—ఈ మాటనబట్టి ఇవేళకు ఎన్నోసారి?

డాక్ట : నీవు లెక్కవేస్తూనే వున్నావుగా. సరే వ్రాసుకో. నేను నిద్రపోతాలే. (సరళ హావభావాలను గమనిస్తూ డాక్టరు నెమ్మదిగా మేడపైకి వెళ్ళిపోతాడు. ఆమె-తిరిగి లేఖ సాగిస్తుంది. సరిగా కుదరలేదనుకొని—ఒకటి, రెండు ఉత్తరాలను చించి చెత్తబుట్టలో వేస్తుంది. ఇంతలో పెన్‌లో సిరా అయిపోయినట్టు తెలుసుకుంటుంది. అప్పుడే శీను గబగవా మేడమించి వచ్చి బయటికి వెడుతుంటే]

సరళ : శీనూ! కాస్త-నీ పెన్ ఇలా ఇవ్వు.

శీను : దీంతో పనుంటుందక్కా?

సరళ : ఏం పని?

శీను : పోర్షనేమైనా రాసుకోవలసి వస్తుందో, ఏమో.

సరళ : ఏపోర్షన్? అంతగా అవసరమైతే ఎవర్నయినా అడిగితీసుకో.

శీను : అలాగేలే. సరె తీసుకో. (పెన్ ఇస్తూ) టైంలేదు. వెళ్ళాలి.

సరళ : ఎక్కడికిరా ఈ పరుగు?

శీను : ఇంకెక్కడికి? స్టేజ్ దగ్గరకు.

సరళ : ఎందుకూ?

శీను . బాగుంది. ఎందుకేమిటి? వేషం, గట్రా వుండదూ?

సరళ : ఇదింకాబాగుంది. బావ ఏం చేస్తున్నారు?

శీను : నిద్రపోతున్నాడు.

సరళ : ఇందాకా అదే అన్నారు. పట్టపగలేం నిద్దరా?

శీను : అలిసిపోయుంటాడు. అయినా—రాత్రికి నాటకం వుందిగా.

సరళ : నాటకం, నాటకం, నాటకం. ఈ ఇంట్లో అందరికీ నాటకం కావాలి.

శీను : అవును. కావాలి. వస్తామరి. [వెడతాడు. చిరాగ్గా కూలబడి పోతుంది సరళ. మళ్ళీ ఆలోచించి—ఆ లేఖ పూర్తి చేతామను కుంటుంది. ఇంతలో వాసు రాధ వ్రాసిపెట్టి పోయిన లేఖతో దూకుడుగా వస్తాడు. గంభీరంగా, ఏదో ప్రమాదాన్ని కల్పించ నున్న దోరణిలో వుంటాడు హఠాత్తుగా సరళ చూస్తుంది. కాస్త తబ్బిబ్బై]

సరళ : రండిరండి. కూచోండి. మీకోసమే చూస్తున్నా. (అతను కూచోడు. సరళ-కాఫీ తెచ్చి తీసుకొమ్మని ఇస్తుంది. తీసుకోక పోగా-ధణన కప్పును విసిరికొడ్తాడు. సరళ అయోమయంలో పడుతుంది) ఏమిటండీ ఇది?

వాసు: ఏమిటా? ఇందులో ఏమీ విషం కలుపలేదుకదా?

సరళ : విషమా!

వాసు: అవును. విషం. మనిషి విషం.

సరళ : ఏ మనిషి విషం?

వాసు: ఇంకెవరున్నారు? నీవే. నీవసలు మనిషివికావు. విషపు పురుగువి.

సరళ : ఏమ్మాట్లాడుతున్నావు వాసూ?

వాసు: నిజం మాట్లాడుతున్నాను సరళా—నిజం మాట్లాడుతున్నాను. కాచి వడబోసిన సత్యం మాట్లాడుతున్నాను.

సరళ : ఏమిటా నిజం?

వాసు: ఏమిటా? నువ్వు మనిషివి కావు; రాక్షసివి. నీలో ద్వేషం, గర్వం కరుడుగట్టుకుపోయాయి సరళా. ఇవ్వన్నీ నిజాలు; పచ్చి నిజాలు.

సరళ : నువ్వేదో ఉద్రేకంలో అర్థంలేకుండా మాట్లాడేస్తున్నావు.

వాసు: లేదు. నేను స్పృహలోనే వున్నాను. ఇవ్వన్నీ రుజువుచేస్తాను.

సరళ : ఏమిటామాట? ఎవరిమీద నాకు ద్వేషం?

వాసు: ఎవరిమీదేమిటి? రాధమీద, నామీద, డాక్టర్ మీద, లోకం మీద, చివరకు నీమీదే నీకు ద్వేషం. నీకేం కావాలో నీకు తెలియదు.

సరళ : నీకు తెలుసునుకాబోలు.

వాసు: తప్పకుండా. నీ మనసులో నీ వొక గొప్ప నటివి కావాలని వుంది. ఈ మాట నీవు లక్షసార్లు చెప్పావు. కాని—దానికి నీవు ప్రయత్నించవు. పెద్ద చదువులు చదివాననే గర్వంతో ఆ మాట చెప్పుకోడానికి నామోషీపడ్డావు. ఈ రంగం పవిత్ర మైందికాదని అంటారనే భయంతో కీర్తిని తెచ్చుకోడానికి జంకుతున్నావు.

సరళ : నేను జంకితే నీ కెందుకూ కోపం?

వాసు: నీ కోర్కెలను ఈడేర్చుకోలేక — అలా ఈడేర్చుకోడానికి ధైర్యంగా ముందుకొచ్చే వారందరిమీదా ద్వేషంగా మార్చు కున్నావు. నీవు చేయలేని పని రాధ చేసి కీర్తిని తెచ్చుకుంటు

న్నది. అది నీవు సహించలేవు. సహించలేని ఆ అసూయకు చెడిపోవడమనే రంగునుపూసి నీ కసి తీర్చుకుంటున్నావు. నీవు చెయ్యలేవు...ఇతరులను చెయ్యనివ్వవు. అబ్బ ! ఎంత విషం దాగివుంది నీలో సరళా.

సరళ : నీవు నన్ను సరిగా అర్థంచేసుకోలేదు వాసూ. పిచ్చిగామాట్లాడేస్తున్నావు.

వాసు: అవును సరళా-నీ పిచ్చి బీజాన్ని అంతటా వెదజల్లి-నన్నూ, రాధనూ, రాధ తండ్రినీ పిచ్చివాళ్లను చేశావు. అన్యాయంగా నాటకం పడకుండా చేస్తున్నావు. కాని-దీనివల్ల నీ ద్వేషాన్ని వెళ్లగక్కుకోవడం దప్ప ఏమీ బావుకోలేవు సరళా. ఎవరి కీర్తిని వాళ్ళు కష్టపడి సంపాదించుకోవాలేగాని-ఇతరుల కీర్తిని కొల్లగొట్టడంవల్ల తమకు కీర్తి రాదు. ఈ సూత్రం బాగా గుర్తుంచుకో.

సరళ : నువ్వేమీ నాకు సూత్రాలు చెప్పక్కర్లేదు.

వాసు: అవున్లే-నీ కన్నీ తెలుసు. అందుకే స్వయంగా చెడిపోతూ—ఇతరులు చెడిపోతున్నారని అపనిందలు వేయగలవు.

సరళ : ఏమిటా మాట వాసూ?

వాసు : తాతకు దగ్గు నేర్పకు సరళా. నీ స్వభావం నాకు బాగా తెలుసు. మగాళ్లను ఆకర్షించాలనే నీ తహతహ, నీ అందాన్ని గూర్చి పొగడ్తలు వినాలనే కుతూహలం-కాలేజీ రోజుల్లో అడుగడుగునా నీలో చూశాను.

సరళ : వాసూ ! కాస్త నెమ్మదిగామాట్లాడు. పైనడాక్టరున్నాడు.

వాసు: (తగ్గకుండానే) విననీ సరళా—నీ నిజస్వరూపాన్ని ఆయనా తెలుసుకోనీ.

సరళ : (తట్టుకోలేక ఫెళ్లున చెంపదెబ్బవేసి కసిగా) ఏమిటా నిజ స్వరూపం?

(ఇంతలో డాక్టర్ బాల్కనీదగ్గరికొచ్చి కాస్త చాటుగా వారి సంభాషణ వింటాడు. వారిద్దరూ గమనించే స్థితిలో లేరు)

వాసు: హబ్బా ! ఎంతపని చేశావు సరళా. ఇదే నీ నిజ స్వరూపం. చదివాననే గర్వం, పలుకుబడి వుందనే అహంకారం, డబ్బుందనే దర్పం-ఇంతదూరం వచ్చిందన్నమాట. సరే సరళా. ఇవేళ నీ ద్వేషంతో ఒక్క ఈ నాటకాన్నాపినంతమాత్రాన మొత్తం నాటకరంగాన్నే ఆపానని సంతోషించకు. ఆరథాన్ని ఆపడం నీ తరంకాదు. ద్వేషం, కుంటి వాదనలతో నిండిన నీబోటివాళ్ల సమాధులమీంచి ఆ బండి హాయిగా వెడుతుందని గుర్తుంచుకో సరళా. అది ముమ్మాటికీ నిజం. బలమైన కోర్కెలు, మొక్కవోని ధైర్యంవున్నవాళ్లను నువ్వెప్పుడూ ఆపలేవు. సరే—ఈ దెబ్బకు నీ వెన్నడైనా పస్తాయిస్తావు. వస్తాను. (వెళ్లబోతాడు-సరళ అడ్డుపడి ఆపుతుంది)

సరళ : (ఏడుస్తూ) క్షమించు వాసూ. నువ్వు నా మనస్సును అపురాలా గ్రహించావు. కాని—ఏంచేయను వాసూ. సహించే ఓర్పు నాలో పోయింది. నీ జీవితంకోసం యుగయుగాలుగా కలవరిస్తున్నాను. నీతోబాటు నాటకాల్లో వేసి నా ఆశయాలను ఈడేర్చుకుందామనుకున్నాను. నిన్నే పెళ్లాడ్దామనుకున్నాను. కాని—ఏం చెయ్యను? నీకన్నా ఎక్కువ చదునుకున్నాననే అహంకారం నాలో పెరిగింది. అందుకే—ఆకోర్కెలను బలవంతంగా చంపుకొని ఇష్టంలేకపోయినా ఈ పెళ్ళి చేసుకున్నాను. నా కభిరుచిగల నాటకరంగాన్నిగురించి అనవసరంగా దురభిప్రాయాలు సృష్టించుకున్నాను. ఈ స్థితిలో-

నీ విక్కడికొచ్చి—నాలో అణగివున్నకోర్కెలను కెలికి పొరలు పొరలుగా బయటికి లాగావు. నీ కీర్తిని చూస్తుంటే నే నెక్కడో పొరపడ్డాననిపించింది. నాకుకూడా రావలసిన కీర్తంతా పోతున్నట్టు భావించాను. ఆ యావలో అసలు నన్ను నేనే మరిచాను వాసూ. నిన్నూ, మీ రాధనూ అయోమయంలో పడేశాను. కాలేజీ చదువునుంచి నా ఈకోర్కెను వెలిబుచ్చే లేఖను నీ కిద్దామని కాచుకొనివున్నాను. అందు కే మాట్లాడుదామన్నాను. కాని—ఎన్నడూ సాహసం చేయలేక పొయ్యాను. ఎప్పటికప్పుడు ఇలాగే (చింపేస్తూ) చింపేస్తూ వచ్చాను...నిజమే. నేను చాలా ఘోరంచేశాను. కాని—ఏం చేయను వాసూ? నాకు తెలియకుండా చేశాను. ఒకప్పుడు తెలిసికూడా పట్టలేక అపకారం చేశాను. కడుపారా తిట్టావు. నా కదే చాలా ఆనందంగా వుంది. నిజంగా ఆనందంగావుంది. చాలు. ఇదొక్కటే నేను చెప్పదలచుకుంది. (ఇక అక్కడ వుండలేక మేడ ఎక్కబోతుంది. బ్యాగ్‌లోంచి వాసు ఫోటో పడిపోతుంది. ఆ సంగతి గమనించదు.)

వాసు: (తేరుకొని) సరళా, సరళా—క్షమించు సరళా! (పిలుస్తాడు. సరళ పలకదు).

డాక్టర్: (అందుకుంటూ కింది కొస్తాడు) నేను క్షమిస్తాను. (కిందపడ్డ ఫోటోనూ, చింపేసిన లేఖనూ తీసుకుంటాడు. ప్రమాదాలేమీ జరక్కుండా అడ్డుపడదామని-పైకి వెళ్ళే సరళ తిరిగి కింది కొస్తుంది) ఏమిటీ హడావుడి వాసూ?

వాసు: (ఏదో చెబుదామని) ఆఁ (అంటాడు. ఆ విషయం చెప్పనివ్వ కుండా సరళ 'వాసూ' అని కేక వేస్తుంది. ఆ తర్వాత వాసు నోరెత్తడు)

డాక్ట : (కటిక నిశ్శబ్దం. డాక్టరు చిరునవ్వు నవ్వుతాడు) ఎందుకా భయం దేవీ. ఇంకాఏం చెప్పలేదులే...ఇదంతా ఏమిటి బ్రదర్?

వాసు: ఏం చెప్పమన్నారు డాక్టర్? మీకు తెలియందేముంది. (ఏం చెప్పాలో తోచక) చిన్ననాటి నాటకంలోని పోర్షనును వల్లె వేసుకుంటున్నాం.

డాక్ట : నేను నటుణ్ణి కాకపోయినా నటనను గుర్తించగలను బ్రదర్. రాదేవీ! నిజంగా ఈనాడు నీ మనస్సును కనుక్కోగలిగాను.

సరళ : (కుంచించుకొని పోతూ) ఏం లేదు డాక్టర్.

డాక్ట : ఈ డాక్టరుకింకా రోగలక్షణాలు చెప్పక్కర్లేదు దేవీ. ఆ భయం, ఆ వణుకు, ఆ చెమటలు, ఈ ఫోటో, లేఖ—ఇవ్వన్నీ రోగలక్షణాలను స్పష్టంగా నిరూపిస్తున్నాయి. నీవింకా నాకు వేరే ఏమీ చెప్పక్కర్లేదు. అయితే-నాకొక్క విషయంలో మటుకు చాలా కోపంగావుంది. ఎందుకో చెప్పగలవా దేవీ? (చెబుతుందేమోనన్నట్టు క్షణమాగి) చెప్పలేవు. అవును. సరె-నేనే చెబుతాను. ఇన్నాళ్లనుంచి ఇంత భయంకరమైన రోగాన్ని మనసులో పెట్టుకొని—ఒక్కసారైనా ఈ డాక్టరుకు చెప్పకపోవడం-అదే నాకు చాలా కోపంగా వుంది. సరె-ఇప్పుడు తెలిసింది. ఇంకేమిటీ చెయ్యడం? (సీరియస్ పోజ్‌లో గట్టిగా) వెంటనే ఇంటినుంచి బయటికెళ్లు.

సరళ : (గజగజలాడుతూ) డాక్టర్!

డాక్ట : భయపడకు దేవీ. ఆ మాటే అనదలుచుకోలేదని చెప్పదలుచుకున్నాను. (సరళ కాస్త కాస్త తేరుకుంటుంది)ఈ నాటికైనా నీమనసులోని విషయాన్ని బయటపెట్టావు.అదే-నాకూ, వాసుగారికీ అందరికీ మంచిదైంది. మిస్టరీ విచ్చిపోయింది. అదే పది

వేలు....ఏంబ్రదర్! నేను సీరియస్‌గానూ, తోటి ఫ్రెండ్‌గానూ అడుగుతున్నాను. దేవి వెలిబుచ్చే అభిప్రాయాలకు నీ సమాధానమేమిటి?

వాసు: నాకిప్పుడు వేరే సమాధాన మేమీ లేదు డాక్టర్. వారికి ఒకప్పుడు నన్నుగూర్చి అలాంటి ఆలోచనలుండవచ్చు. కాని—ఏనాడో వారిని గురించి ఆలోచించే అర్హత నాకు లేదని నిర్ణయించుకొనే వేరే మార్గం తొక్కాను. అప్పటికీ, ఇప్పటికీ అదే నా అభిప్రాయం.

డాక్ట : మరి—నీవేమంటావు దేవీ?

సరళ : నమ్మండి డాక్టర్. ఈ విషయాన్ని మనసులోంచి బయట పెట్టాక నాకెంతో బరువు దిగిపోయినట్టుగా వుంది. నాకిప్పుడు అంతా మామూలుగా, తేటగావుంది.

డాక్ట : ఇంత సులువుగా పోయేదానికి ఇన్నాళ్ళెందుకు మధన పడాల్సి వచ్చింది దేవీ?

సరళ : అదంతా నా అతిశయమే డాక్టర్. క్షమించండి.

డాక్ట : సరే - దీనికంటే క్షమించవచ్చు. కాని - ఈనాటి నాటకాన్ని ఆపినందుకు ఎవరు క్షమిస్తారు?

సరళ : మరి-ఏం చెయ్యమన్నారు చెప్పండి డాక్టర్.

డాక్ట : రాధగారి పోర్షన్ ఇప్పటి కిప్పుడు చదివి పని వెళ్లదీయలేవూ? అన్ని విధాలా బాగుంటుంది.

సరళ : చేయగలను. కాని—ఇది సమయంకాదు డాక్టర్. (టైంచూసి) ఇంకా రైలువెళ్ళే వేళ కాలేదు. రాధగారిని ఏమైనా సరే బ్రతిమాలి తీసుకొస్తాను.

(వెళ్ళిపోతుంది)

డాక్టర్ :ఏమిటి బ్రదర్-ఈ గాలిదుమారాన్ని ఏమనాలి?

వాసు: ఏమిటో డాక్టర్. నాకేమీ తోచకుండా వుంది. ఇవేళ నాటకం ఎలా పడుతుందో?

శీను : (బయటినుంచి వస్తూనే అందుకుంటాడు) నాటకమా సర్. నేనుండగా మీ కెందుకండీ భయం? రాధగారు వెళ్ళిపోయారని విన్నాను. అయినా భయపడకండి. మీకే వేషం కావాలంటే ఆ వేషం వేసేస్తాను. ఏం బావయ్యా?

డాక్ట : ఏమిటిది శీనూ—సమయం, సందర్భం లేకుండా?

శీను : ఇంతకన్నా సమయం,సందర్భం మరోటివస్తుందా బావయ్యా. ఆ మధ్యోకసారి నేను ఆడవేషాలు వేస్తే-మేకప్‌లో కొట్టొచ్చేట్టుంటానని అన్నావుకదూ? ఏమండీ-ఏమంటారు?

డాక్ట : అరేయ్—వారి నిప్పుడు మాట్లాడించకు. రెండు కాఫీలు తెప్పించు. (శీను వెడతాడు)...ఈ మాత్రానికి పెద్ద విచార మెందుకు బ్రదర్. ఇలాంటివి జీవితంలో ఎన్నిరావు గనుక? ఆమాత్రం తట్టుకోలేకపోతే ఎలా?

వాసు: అది కాదు డాక్టర్. మీరింత ఉదారవంతులు కాకుంటే ఈ గొడవంతా దేనికి దారితీసేది?

డాక్ట : ఇందులో పెద్ద నా ఉదారతేమీలేదునిజానికి. ఆవిడ భావాలు అస్పష్టం. నావి స్పష్టం. అంతే తేడా. ఇప్పుడు ఆవిడకూడా స్పష్టీకరించింది కనుక ఇక బాధే లేదు.

వాసు: మీరు కాబట్టి వీటినింత తేలిగ్గా పరిష్కరించ గలిగారు.

డాక్ట : అలాకాకుంటే అడుగడుగునా మథనపడుతూ ఎక్కడ కూచుంటాం బ్రదర్. ఇన్నాళ్లనుంచీ మనకు తెలియనివిషయం బయట

పడితే దానికెందుకు తబ్బిబ్బు కావాలి? అది - ఈనాటికైనా తెలిసిందని సంతృప్తిపడితే మంచిదంటాను.

వాసు: దానికెంత గుండె నిబ్బరం కావాలంటారు?

డాక్ట : సరె—అదంతా మనుషుల స్వభావాలమీద ఆధారపడి వుంటుందనుకొండి.

శీను : [కాఫీలు తెచ్చి] ఏమిటిసర్-ఆలోచించారా?

డాక్ట : ఎందుకురా అంత తొందర?

శీను : అదేమిటి బావా. తీరా స్టేజ్ మీది కెక్కబోయేప్పుడు పోర్షను చేతికిస్తే ఎలాచస్తాను? ఎంత నటుణ్ణయినా ఒక్కమారన్నా పోర్షను చూసుకోవాలిగా. లేకుంటే—పక్కవాళ్లతో సమంగా తూగలేక కాంబినేషఙ చెడిపోదూ?

డాక్ట : భలేవాడివి. నిజంగా ఆ పోర్షను నీవు చేస్తున్నట్టే మాట్లాడుతున్నావే!

శీను : బాగుందే. మరి-నేను కాకపోతే వాసుగారు చేస్తారేమిటి? ఎలాగూ వారు హీరో వేషం వేయాలిగా. అయినా—హీరోయిఙ పోర్షన్ వారికేం వచ్చు పాపం. ఏమండీ?

వాసు: రాదు బాబూ. నా పోర్షన్ నాకు రావడమే కష్టంగావుంది. ఇంకొకరిదెలా వస్తుంది? అయితే—మీకు వచ్చుకాబోలు.

శీను : ఇంకా కాబోలేమిటండీ. ఒక్కసారి ఆ పుస్తకమిలా ఇవ్వండి-క్షణంలో చదివేస్తాను. వీటిని అంటిపెట్టుకొని వుండబట్టేగదండి (దర్జాగా) నా పరీక్ష పోయింది.

డాక్ట : శీనూ! ఈ సోదంతా వారిదగ్గరెందుకురా?

శీను : ఛాన్సు బావా; ఛాన్సు. సమయం వచ్చినప్పుడు చెప్పకుంటే ఎలా?

డాక్ట : నీవు చెప్పుకోకుండానే వారి కర్థం అయ్యావు.

శీను : అయితే-ఏదీ ట్రూపులోకి తీసుకోలేదే?

డాక్ట : దయచేసి—వీణ్ని మీ ట్రూప్‌లోకి తీసుకో బ్రదర్.

వాసు: తప్పకుండా. అంతకన్నానా?

శీను : ఆయితే — పుస్తకంతేనా సర్. ఎక్కడుంది? ఆఁ. ఆ బసలో వుండొచ్చు. బంగళా కెళ్లనా?

డాక్ట : అక్కర్లేదు.

శీను : సరే—మీఇష్టం. ఆ తర్వాత నేనుసరిగా చేయలేదంటే కుదరదు.

వాసు: అలాగేలెండి.

శీను : మీకేం. మీరంటే దయదలిచి వూరుకుంటారు. ప్రేక్షక మహాశయులు వూరుకుంటారా సర్. వారికి అసంతృప్తిగా వుందని తోచినప్పుడు సమస్తమైన పనికిరాని పాత పరికరాలన్నింటినీ నా మీదికే ప్రయోగిస్తారు. అదెలా తట్టుకోవడం? ఎందుకొచ్చిన తంటా ఇదంతా. చదివేస్తాను.

(ఇంతలో రాధవస్తుంది)

డాక్ట : అదిగోండి—రాధగారు వచ్చారు.

వాసు: సరళగారేరీ?

రాధ : ఏమో నాకేం తెలుసు. అయినా - నా కోసం వారెందుకు వస్తారు? అసలు...

వాసు: అదంతా ఇప్పుడనవసరం. కథ చాలా దూరం వెళ్ళి పరిష్కారమై పోయింది. ఆ వివరాలు తర్వాత చెబుతాను. అయితే—మీరెలా వచ్చారు?

రాధ : ఎలా ఏమిటండీ? నాటకమో, నాన్నో తేల్చుకొని వచ్చాను.

డాక్ట : ఆలోచించుకొనే ఆ నిర్ణయాని కొచ్చారా రాధగారూ?

రాధ : అవును డాక్టర్. ఇందాక-ఆలోచించుకోడానికే అవకాశంలేని స్థితిలో వెళ్లవలసివచ్చింది.

వాసు: తిరిగి మీరింతటి నిర్ణయానికి రావడం...

రాధ : సాహసమే వాసుగారూ. కాని ఏంచెయ్యను? పరీక్షాసమయం వచ్చింది. జీవితంలో ఏదో ఒకటి తేల్చుకోవలసిన స్థితిలో పడ్డాను. ముమ్ముందు రాణించగలననే ఆశతో నాటకరంగాన్ని అంటిపెట్టుకొని వుండడమో, చిన్ననాటినుంచి పెంచారనే మక్కువతో నాన్న నంటిపెట్టుకొని వుండడమో తేల్చుకోవలసివచ్చింది. ఇవేళ నాటకంలో వేస్తానని మాటఇచ్చి, ఇంత పబ్లిసిటీ జరిగాక—నేనూ, ఇతరులు నష్టేట్లో కొట్టుకోపోవడం నా కిష్టంలేదు. ఆ తర్వాత నేను మొహంఎత్తుకొని బ్రతుకలేను. నా బ్రతుకును నాన్న నడపలేడు.

డాక్ట : నేను చెప్పలే బ్రదర్—ఇలాంటి బలమైన కోర్కెలుగలవాళ్ళను అణచజూచే తండ్రులనూ, భర్తలనూ ఉప్పుపాతర వెయ్య బుద్ధేస్తుందని. నిజంగా నీవు గొప్పదానివమ్మా.

రాధ : ఆ మాటనకండి డాక్టర్. ఇలా చేశానేగాని-నామీద ఎన్నెన్నో బాధ్యతలు పడ్డాయి.

డాక్ట : వాటికి భయపడకమ్మా. ప్రతి రంగంలోనూ బాధ్యతలంటూ వుంటాయి. ఒంట్లో సత్తువ, గుండెలో ధైర్యంఉండాలేగాని—ఎన్ని బాధ్యతలనైనా నెరవేర్చగలవు.

వాసు: డాక్టర్! ఇప్పటికొక పెద్ద సమస్య తీరిపోయింది. అప్పటి నుంచి మీతో ఏదో మాట్లాడుతున్నానేగాని—నా మనసంతా ఎంత ఆందోళన పడుతున్నదో చెప్పలేను. హమ్మయ్యా. పెద్ద

గండంనుంచి బయటపడ్డాను.(రాధతో) అయితే—మీ నాన్నగారి పోర్షను మరెవరికన్నా ఇవ్వాలన్నమాట?

శీను : ఎవరికో ఏమిటండీ—నేనుండగా?

డాక్ట : అదే అనుకుంటున్నారు పాపం. ఎక్కడ్నుంచి వింటావురా?

శీను : అదేమిటి బావా-నా పోర్ష నెక్కడుందో నాకు తెలియదూ? ఏమంటారు మరి? బస కెళ్ళి పుస్తకం తెమ్మంటారా?

వాసు: అలాగే బాబూ. తొందరపడడ మెందుకూ?

శీను : తొందరకాదు సర్. మీ పోర్షను శీనుగారు చదువుతామంటు న్నారండీ రాధగారూ !

రాధ : ఇంకా ఏం. ఆ రకంగా నాటకాల్లోకి ఆడవాళ్ళు రానక్కర్లే కుండా పని వెళ్లదీసుకోకపొయ్యారూ?

డాక్ట : నిజమేకాని—భగవంతుడు మగాళ్లనూ, ఆడాళ్లనూ వేరువేరుగా సృష్టించాడమ్మా.

(సరళ, సీతాపతి రావడాన్ని ముందు వాసుచూస్తాడు)

వాసు: అదిగొండి—సరళగారు వస్తున్నారు.

సరళ : క్షమించండి. నే నక్కడికి వెళ్ళేసరికే రాధగారు వచ్చేశారు. సీతాపతిగారిని తీసుకొచ్చాను.

శీను : హోరి భగవంతుడా, ఈ పోర్షనుకూడా లేకుండా చేశావూ?

సీతా : ఏమిటది?

రాధ : మీ పోర్షను శీనుగారు చదువుదామని చూస్తున్నారట.

సీతా : చదువు బాబూ. ఎలాగైనా ఇవేళ నా మనసేమీ బాగుండ లేదు.

శీను : మీఒక్కరి మనసేమొచ్చింది? ఇందులో ఎవరిమనసూ బాగుండ

లేదు-ఒక్క నాదితప్పు-(మళ్ళీ సందేహ మొచ్చింది)అక్కయ్యా, అసలు నాకు మనసుందా నే?

సరళ : పోరా-ఎందుకు లేదూ?

శీను : ఉందీ. మన పోర్షన్‌లో ఎక్కడా తగల్లేదులే. అయినా—ఒక మారు లేదన్నట్టున్నావ్?

డాక్ట : (సరళవైపు చూస్తూ శీనుకు సమాధానంగా) నీకు మనసున్నా లేకున్నా ఎవరికీ ప్రమాదం లేదు.

సరళ : నన్నింకా ఏడిపించకు డాక్టర్.

డాక్ట : నీవు వాసుగారిని ఏడిపించావు. గుర్తుందా?

సరళ : నన్ను అంతా క్షమించండి బాబూ. నే నిక్కడ నిలువలేను.

(మేడ ఎక్కడానికి మెట్లెక్కబోతుంటే)

డాక్ట : నువ్విలా ఆగుదేవీ. రాధగారు పైకి వెడతారు. ఆపాట వాయిస్తారు...పదండి రాధగారూ! ఊఁ—కదలండి.

రాధ : ఎందుకండీ-మీకా పాట?

డాక్ట : (సరళ వైపుచూసి) ఆ పాట దేవికి ఇప్పుడెలా వుంటుందో చూస్తాను.

[రాధ పైకివెళ్లి పాట పాడుతూ వాయిస్తుంటుంది. మిగతా వారుఅక్కడే సోఫాల్లో కూచుంటారు.పాటలో "పాము కుబుసంలాగ" అన్న చరణం వచ్చినప్పుడు డాక్టర్ సరళవైపు చూస్తాడు. ఆమె—చిరునవ్వుతో వుంటుంది. అంతా అదే స్థితిలో వుండగా తెర]

# అభిప్రాయం

మిత్రులు నరసింహారావుగారు నన్ను "నటులుగా మీ అభిప్రాయాన్ని వ్రాసి యివ్వండి" అని అడిగారు. నటునిగా నటించగలనేకాని, అభిప్రాయాన్ని విపులంగా వ్రాయగల శక్తి నాలోవుందనుకోను. అయినా, నాకు యీ నాటకంమీద వున్న ప్రత్యేకాభిమానాన్ని పురస్కరించుకొని వ్రాయగలిగింది వ్రాస్తాను.

"క్రీనీడలు" నాటకం వ్రాసి, నరసింహారావుగారు అమెచ్యూర్ నాటక సంస్థలకు ఎంతో వెలుగును తీసుకొచ్చారు. సరిక్రొత్త పోకడ, నవీన దృక్పథం, అభ్యుదయ భావాలతో నిండి నాటకరంగంలో గాలి దుమారం లేపగలిగింది యీ నాటకం—అనటంలో అతిశయోక్తి లేదు. నటింపగల శక్తి సామర్థ్యాలు వుండికూడా సంఘ విమర్శలకు లోనౌతామేమో అని, కనపడని కట్టుబాట్లకు లోనైన స్వేఛ్ఛావాదులకు, యిచ్ఛా జీవులకు—యింకా పెనుతుఫానుగాలులు వీస్తూ, కట్టలు తెంచుకునే నదీమ తల్లిగర్భంలో చిక్కిన నావికుని చందమున హోరా హోరీగా సమరం సాగిద్దామనుకొనే నారీమ తల్లులకు 'క్రీనీడలు' చుక్కాని వంటిది.

అభ్యుదయ భావాలతో, అమెచ్యూర్ సంస్థలను స్థాపించి, నాటక కళను వుద్ధరించాలనే ఔత్సాహికులకు, అభిమానులకు, ఆదర్శ నటులకు—"వాసు"—దర్శకుడు.

నటించాలనే కోర్కెను చంపుకోలేక, అభిరుచిని మ్రింగివేయలేక, ఆదర్శాలను హతమార్చలేక వేడి నిట్టూర్పులతో నిత్య జీవితాల్ని నెమరువేసే చెల్లెళ్ళకి—"సరళ"—తల్లి.

గుండెధైర్యం, కాలప్రవాహానికి ఎదురీదగలశక్తి, వుండి, నిత్య జీవితంలో మచ్చలేకుండా, నాటక కళలో తమ ప్రతిభను నిరూపించి, కృతకృత్యులు కాదలుచుకొన్న కోమలీమణులకు—"రాధ"-చుక్కాని.

"వ్యాధి ముదిరేవరకూ శస్త్రచికిత్స ఎంత అనవసరమో, గుండె లోతుల్ని Search Light తో స్వయంగాపరీక్షించి, సత్యాన్ని గ్రహించనంతమటుకు "అనుమానం" అనే పెనువ్యాధి జోలికి పోవడంకూడా అంత అనవసరమే''-అన్న సూత్రాన్ని Research చేసి, అంకితం చేశాడు లోకంలోని భర్తలకు-''డాక్టర్" Brother.

సహజంగా సంతానంకోసం తమ శక్తినంతా ధారపోసి, వున్న దంతా త్యాగంచేసి, పెంచి పెద్దలను చేయగలిగి, తమ సామర్థ్యాలను నిరూపించుకొని, తమ బిడ్డల ప్రతి అణువుయొక్క నైజాన్ని జీర్ణింప చేసుకొన్న తండ్రులు సహితం అనుమానమనే పెనువ్యాధికి గురియై, పరువు-ప్రతిష్టల మధ్య Pendulum లా పెనుగులాడే తండ్రులకు- "సీతాపతి''-తండ్రి.

అనుక్షణం ఆనందసాగరంలో అలలపై అలా అలా తేలిపోతూ, మనస్సులేని ఆ ఖాళీ ప్రదేశంలో నాటక రంగస్థలం నిర్మించి, తాము కూడా నాటకాలు ఆడి, (కనీసం కర్టెన్‌లాగిఅయినా) నటులమనిపించు కోవాలని, అహర్నిశలు వూహాగానం చేసుకొని, ఒక్కొక్కసారి భావోద్రేకాగ్నికి తాళలేక, మనస్సును మంటకలిపి, జీవితాల్ని అయోమయంగా గడిపే 'అక్కయ్య తమ్ముళ్ల'కు -''శీను''—అన్నయ్య.

ఇలా 'నాటక రంగం' అనే కథావస్తువుతో, సమూలంగా సంఘాన్ని కూకటివేళ్లతోకదలింపచేయటంలో, రచయిత ''క్రీనీడలు" ద్వారా కృతకృత్యులయ్యారు.

వివిధమనస్తత్వాలనువిశదీకరించిన 'క్రీనీడలు' నాటకంలోనిపాత్ర లను రంగస్థలంమీద నటనద్వారా వ్యక్తపరచాలంటే ఎంతో అను భవం, సమర్థత కావాలనిపిస్తోంది. ఇందులో ప్రతి పాత్ర ప్రత్యేక స్థాయిని అందుకొంది. "రచనలో **పాండిత్యమే** ప్రధానం కాదు; వ్యావహారికం అంతకన్నా ఎక్కువగా గుండెల్లో గుచ్చుకుపోతుంది" అనటానికి "క్రీనీడలు" ప్రత్యక్ష సాక్ష్యం.

*డి. రాజేశ్వరరావు*

| | రు. న. పై. | |
|---|---|---|
| తెలంగాణా తీరుతెన్నులు [లేఖలు] 'భవదీయుడు' | 1 | 00 |
| గెలువు నీదే [నాటకం] కె. యల్. నరసింహారావు | 1 | 00 |
| ఒకరోజు [నాటిక] ,, ,, | 1 | 00 |
| గండిపడ్డ జీవితాలు [కథలు] పి.యస్.ఆర్.ఆంజనేయశాస్త్రి | 0 | 62 |
| కృష్ణారావు కథలు [కథలు] భాస్కరభట్ల కృష్ణారావు | 0 | 75 |
| జాతీయ పతాకము [చరిత్ర] కోదాటి నారాయణరావు | 0 | 37 |
| ఇంద్ర ధనుస్సు [రేడియో ప్రసంగాలు] ,, | 0 | 50 |
| *కొత్త గుడి [నాటకం] కె. యల్. నరసింహారావు | 0 | 50 |

ప్రతులకు :

జనపద ప్రచురణలు,
1-8-452, చిక్కడ్‌పల్లి,
హైదరాబాదు-1.

*హైదరాబాద్ కేంద్ర సహకార సమితి ప్రచురణ

మా ప్రచురణలు :

# మన్వంతరం

(నవల)

రచన : తారాశంకర్ బెనర్జీ

అనుకృతి: మద్దిపట్ల సూరి

వెల : నాలుగు రూపాయలు

✳

కె. యల్. నరసింహారావు నాటకాలు :

# అడుగుజాడలు

[ప్రణాళిక పోటీల్లో ప్రథమ బహుమతి నందినది]

# క్రీనీడలు

ఒక్కొక్కటి : రూపాయి

✳

త్వరలో :

# తేనె పాటలు

[గేయాలు]

రచన : దాశరథి
నారాయణరెడ్డి

# కొమ్మ సంపెంగ

[రేడియో నాటికలు]

రచన : గోరాశాస్త్రి

ప్రతులకు :

# ఆంధ్ర బుక్ హౌస్

సుల్తాన్ బజారు : : హైదరాబాదు-1



'భవదీయుడు' గా — నరసింహారావు 'తెలుగు స్వతంత్ర' ద్వారా 'తెలంగాణా తీరుతెన్నులు' తెలిపాడు.

రచయిత గా — ఇంకా ఆదర్శలోకాలు, ఒకరోజు, గెలుపునీదే, అడుగుజాడలు, క్రీనీడలు, క్రొత్తగుడి, సుడిగుండాలు, కాలప్రవాహం, ఒడుదుడుకులు, గుణపాఠం, ఇంతేనా ? మొదలైన నాటకాలు, నాటికలు, మరకొన్ని కథలు వ్రాశాడు. ప్రస్తుతం విషవలయం, అభాగ్యులు, అంతరాలు అనే నాటకాలు వ్రాయాలని ప్రయత్నం.

నటుడు గా — 'గ్రామవెలుగు' నాట్యమండలి, 'జనతా కళామండలి', 'జీ. వే. మ.' ప్రదర్శనల్లో పాల్గొన్నాడు.

సహాయసంపాదకుడు గా — 'ప్రగతి', 'ప్రజావాణి' పత్రికలలో పని చేశాడు.

రేడియో ఆర్టిస్టు గా — హైద్రాబాద్ కేంద్రంలో స్క్రిప్ట్ రైటర్, పార్టిసిపేటర్ పనిచేస్తున్నాడు.